# జ్ఞాని

కాలేజీ జీవితానంతరం ఇరవై సంవత్సరాలకు దాసును కలుసుకోగలిగాను. దాసు ప్లీడరువృత్తిలో మంచిపేరూ, పేరుతోపాటు ధనమూ, గౌరవమూ, సంపాయించాడు. ఆనాడు ఒక పండుగను అనుభవిస్తూన్నట్టుంది.

ఆరాత్రి తీరిగ్గా కాలక్షేపం చేస్తున్నాం. జీవితంమీాదా, ప్రేమమీాదా చర్చ ఆరంభమైంది.

"జీవితంలో 'ప్రేమ' అనేది చేసేమోసం ఎంతైనా వుంది. జీవితాలు తలక్రిందులయేందుకూ, అపార్థం చేసుకొని, గుడ్డిగా దారితప్పి నడిచేందుకూ బాగా సహాయపడేది ప్రేమ!" అన్నాడు దాసు.

"ఏం అలా సెలవిచ్చావ్? ప్రేమించినవాళ్ళందరూ మోసపొయ్యారనే అంటావా?"

"అసలు అది ప్రేమో కాదో తెలియటమే కష్టమైనప్పుడు, ఇక మోసపొయ్యారో లేదో ఎవరికి ఎట్లా తెలుస్తుందీ?"

"నీ దృష్టిలో ప్రేమఅంటే యేమిటో ముందుచెప్పు."

"దృష్టి కొకరకం ప్రేమఅయితే, మనిద్దరమూ ప్రేమను గూర్చి చర్చించటం అసంభవం!"

"పోనీ నువ్వు దాన్ని నిర్వచించు"

"నిర్వచనంతో యేమీ తేలదు. నేనొక కథ చదువుతాను. అది విన్నాక, ఇద్దరమూ చర్చిద్దాం"

నేను నవ్వి, "కథా–మనకు ఆధారం? నేను చాలా కథలు చదివాను. బేడపారేస్తే సత్కాలక్షేపం చేసేందుకు వీలుగా దొరికే రైల్వే సారస్వతంతో బుర్రంతా దిమ్మెక్కిపోయింది" అన్నాను.

"దాన్ని కథ అనటం నాదే పొరపాటు......ఒక స్వీయ చరిత్ర అనటమో, జీవితయాత్ర అనటమో సమంజసం"

నేను ఇబ్బందిగా చూశాను.

"నీకు ఎక్కడ కష్టంగా వుంటే అక్కడే ఆగుదాం" అన్నాడు దాసు.

"సరే...కానీ" అన్నాను.

దాసు ఒక పెద్దకవరు తీసుకొచ్చి, కొన్ని కాగితాలు తీసి చదవ నారంభించాడు. నేను కుర్చీలో పడుకొని ప్రశాంతంగా వినసాగాను:

# 1

"చిన్నతనంలో అతనితో కలిసి ఆటలాడుకునేదాన్ని. ప్రతి పూటా ఇద్దరమూ కలిసి స్కూలుకు వెళ్ళేవాళ్ళం. ఒకే కుటుంబంలోని వ్యక్తులకన్నా, ఎక్కువ మక్కువతో పెరిగాం. నాకు జ్ఞానం వొచ్చాక, అతనితో పదేళ్ళకు పైగా

స్నేహం వుంది. మా స్నేహం క్రమంగా అతనిమీద తీరని అభిమానాన్నీ, ఆ అభిమానం ప్రేమనూ నాలో ఘాటుగా నాటింది. ఇది గ్రహించగలిగేందుకు నాకు ఎక్కువ కాలం పట్టలేదు.

అతను కాలేజిలో జేరిననాటి సాయంత్రం నాదగ్గరకు వొచ్చి, "నువ్వు కాలేజిలో జేరలేదేం?" అని అడిగాడు.

"నేనింక చదవను. నాచదువు అనవసరమని మావాళ్లు అన్నారు"

అతను తలతిప్పి, తల వొంచుకొని చాలాసేపు ఆలోచిస్తూ కూర్చొని, దీనంగా, జాలిగా నావైపుచూసి వెళ్ళి పొయ్యాడు. నాచదువు విషయాన్నిగూర్చి అతను చర్చించ లేదు. కనీసం సానుభూతిగానన్నా మాట్లాడలేదు. విచార కరంగా నన్ను ఓదార్చుతాడేమోనని ఆశపడ్డాను. అసలు తనకు ఇదొక సమస్యేకానట్టు చప్పరించి ఊరుకున్నాడు. నాకెంతో ఆశాభంగమైంది.

ఆరోజుమొదలూ అతను మాఇంటికి రాకపోకలుకూడా తగ్గించాడు. ఎదురింటి వ్యక్తి, కనీసం ఇరుగు పొరుగులన్న దృష్టినీ, మాస్నేహాన్నికూడా మరిచిపోయి అతాత్తుగా ఇలా మారిపోవటం నాకు మరీ కష్టంగా తోచింది. నేనేంతప్పు చేశానూ? అతని కేమన్నా కష్టం కలిగించేమో? పోనీ, అలాటిదేమన్నా వుంటే, ఆ కారణాన్నయినా నాకు తెలియపరచ కూడదా? ఆ తెలియని కాలేజీజీవితాన్ని

గూర్చి రోజూ సాయంత్రం నాకు వినిపించకూడదనా? అనుభవించే అవకాశంలేని ఆ ఆనందాన్ని (?) నేను విని తృప్తిపడతానేమోనని అతని భయమా?

ఒకసాయంత్రం అతని రాకకోసమే వాకిట్లో కాపలా వేశాను. తలవొంచుకొని రోడ్డుపక్కనే వొస్తున్నాడు. ఈలోకమూ, రోడ్డుమీద నడిచే ఇతరవ్యక్తులూ, తొందర తొందరగా పరుగులెత్తే రకరకాల వాహనాలూ, దుమ్మూ, ధూళీ—ఇవేమీ అతనికి పట్టనట్టేవుంది. ఏదో ఆలోచనా భారం, వ్యధను కలిగించే తలపులబరువు అతని ముఖం లోనూ, కళ్ళల్లోనూ స్పష్టంగా కనిపిస్తూనేవుంది.

తల ఎత్తి నన్నుచూసి, చూడనట్టే, ఏమీ ఎరగనట్టే తల వొంచుకొని, తనదారిని పోబోతున్నాడు.

"రవీ!" అన్నాను.

తలఎత్తి 'చెప్పు' అన్నట్టు చూశాడు.

"మాఇంటికి రావటమే మానేశావ్"

జవాబుకోసం మాటల్ని వెతుక్కుంటున్నట్టున్నాడు.

"రాకూడదనుకున్నావా?"

తన ప్రవర్తన నాలో కల్పించిన యీ దురభిప్రాయానికి కాబోలు నొచ్చుకుంటూ, "ఎబ్బే! ఎందుకు రాకూడదూ?" అన్నాడు.

"ఇతే—ఠా"

మాట్లాడకుండా, నా వెనకాలే వొచ్చి, కూర్చున్నాడు. ఇదివరకు తినంతట తానుగా ఎన్నో విషయాల్ని మాట్లాడే వాడు. ఎంతో కాలక్షేపంగా ఉండేది. ఇప్పుడు మౌనవ్రతం దాల్చినట్టున్నాడు. అతనిలో ఇదివరకు ఉండే ఉత్సాహ మేమీ కనిపించదు. నిరుత్సాహంతో కుంగిపోతూన్నట్టని పించింది. అతన్నిలా బాధించే సమస్య యేమిటో తెలుసుకో వాలనే కుతూహలం నాలో బాగా పనిచేస్తోంది. స్నేహితు రాల్ని ఆమాత్రం వినకూడదా?

టేబిలు మీదవున్న అతని పుస్తకాల్ని తిరగేస్తూ "చాలా కష్టమైన చదువు!" అన్నాను.

"నష్టం కూడా నేమో!"

"ఏం అలా అన్నావ్?"

"నాకు అలాతోస్తుంది. అంతా బట్టీ పెట్టే వ్యవహారమే కాని, నిజమైన లోకజ్ఞానంకాని, స్వతహాగా బుర్రతో ఆలో చించటంకానీ కనిపించదు. లోగడ ఎప్పుడో కొందరు మేధా వులు, నిఘంటువుల సహాయంతో దింపిన క్లిష్టమైన భాషను, మన బుర్రల్లో కూడా మెల్లిమెల్లిగా ఎక్కించే సదు పాయంగా తోస్తోంది. మన ఆలోచనకు తావు లేకుండా, వాళ్ళరాతల్నే మన మీద రుద్దటంతప్ప ఇంకేమీ లేదు. ఇవన్నీ ఎందుకు పెట్టారో, ఇంతమంది యీ చదువు కోసం బందిల దొడ్లోకి వెళ్లే పొగరుమోతు పశువుల్లాగు, కాలేజి

కాంపౌండ్ లోకి గుంపులు గుంపులుగా ఎందుకు ఎగబడు తున్నారో నాకు ఆశ్చర్యంగానేవుంది.''

''మరి చదవటం దేనికే?'' అన్నాను.

''ఏదో ఒకటి చెయ్యాలి కదా? ఈ చదువన్నా లేక పోతే గాలికి తిరగాలి. అప్పుడు ఎంతక్రూరమైన తలపులు నాతలలో ప్రవేశిస్తయ్యో, ఎన్ని దుర్మార్గాలు చేసేందుకు నాలో శక్తి పుట్టుకొస్తుందో ఆలోచించు. ఎటూకదలకుండా ఉండేందుకే పెద్దలు యీ గుదిబండను మెడలో వేసే ఉపాయాన్ని కనిపెట్టారనుకుంటాను.''

''ఊహుఁ. ఇంకా కాలేజీఅంటే ఎంత గొప్పో, ఆ అనుభవం నాకు లేకపోయిందేఅనిబాధపడుతున్నాను''అన్నాను. ఆ 'గొప్ప' అంతా నాకు ఇప్పుడే మహా అర్థమై పోయినట్టు!

''నేను చదువుకుంటూ బాధపడుతున్నాను. నువ్వుచదివే శ్రమ కూడా లేకుండా బాధపడుతున్నావ్, అంతే భేదం!''

కాసేపు మౌనంలోనే గడిచి పోయింది.

''కాఫీ తాగుతావా?''

జవాబు రాలేదు.

''తెస్తాను—''అని లేచాను.

''ఒద్దులే!''

''అంత మొహమాటం దేనికీ? ఇది పరాయి కొంప కాదుగా!''

కాఫీ తీసుకొచ్చాను; ఇద్దరమూ తాగాం.

సంభాషణను మార్చాలని చూస్తున్నాను.

"నా క్షేమాన్ని విచారించటం బొత్తిగా మానేశావు" అన్నాను.

'అట్లాగా?' అన్నట్టు చూశాడు.

అతను ప్రతి విషయంలోనూ చాలా నెమ్మదిని సూచిస్తాడు. ఎదుటివ్యక్తి ఓర్పు పూర్తయ్యే సందర్భాలు కూడా నాకు అనుభవం వుంది. కాని సంవత్సరాల స్నేహం ఉండబట్టి, నేను యీ 'నెమ్మది'కి బాగా అలవాటుపడి పోయ్యాను. అతను చిన్నతనంలోనే పోగొట్టుకున్న తల్లి దగ్గర్నుంచి యీ సుగుణం అతనికి అబ్బిందని మా అమ్మ అనేది. స్వల్పవిషయాలమీదకూడా ఇలాగే ఆలోచిస్తూండే వాడు.

"నామీద నీకు కోపంవచ్చింది—అవునా ?"

నవ్వి, "ఔను...ఎవరన్నారూ ?" అన్నాడు.

"నాకు అలాతోస్తుంది—"

"రోజూసాయింత్రం మాఇంటికి రాకూడదా ? అన్నాను.

"వొస్తాను—" అని లేచి, ఒక్కక్షణం ఆగి వెళ్ళి పొయ్యాడు. సంభాషణ ఇలా అకాత్తుగా ఆగిపోవాల్సి వొస్తుందని నేను అనుకోలేదు.

## 2

"ఆనాటినుంచీ అతను ప్రతి సాయింత్రమూ వొస్తూనే వున్నాడు. కాని, సంభాషణలో అధికభాగం నా వొంతే !

అతను దాదాపు మౌనంగా కూర్చొని నేను చెప్పేమాటల్ని వింటూ, పరధ్యానంగా యేమో ఆలోచిస్తూ ఉండేవాడు. అతను యీవిధంగా ఎందుకు మారిపోతున్నాడో అర్థమవటంలేదు.

ప్రతిరాత్రీ అతన్నిగూర్చి ఎంతగానో ఆలోచించేదాన్ని. నావిషయంలో అతని అభిప్రాయం ఏమిటి? నాకు నేనుగా యీప్రశ్నను అడగటం ఎలా? నన్ను అతను ప్రేమించాడా? ప్రేమించగలడా? ఒకవేళ ప్రేమించినట్టయితే, అతను ఆ విషయాన్ని ఎందుకు బైటపెట్టడు? పురుషుడైన అతనే ఆపని చెయ్యలేకపోతే—స్త్రీని నేనెలా సూచించేది? అసలు ఇలాటి ప్రేమసంఘటనే అతన్నిలా వెంటపడి బాధిస్తోందేమో? ఒకవేళ అతనికి ఇంకో ప్రియురాలు ఉన్నదేమో? ఈ సంగతి తలుచుకునేప్పటికి భయంతో కోపంతో మనస్సు చీకాకుపడ్డది. ఇంకో ప్రియురాలు! ఆకాల్పనిక ప్రియురాలు(?) నా కంటపడితే— ప్రాణాలమీంది ఆశను వొదులుకోవాల్సిందే! ఏమైనా, ఇక యీ ప్రేమను దాయగలిగే స్థితిలోంచి మాత్రం బైటపడ్డాను. భయపడుతూ, సిగ్గుపడుతూ వృథా కాలయాపన చెయ్యటంవల్ల ప్రయోజనం లేదు. అర్థంకాకుండా బాధపడటం కన్నా, ఎటో తేల్చుకొని బైటపడటం— వెయ్యిరెట్లు మేలనిపించింది. సమయం మించిపొయ్యాక పశ్చాత్తాపపడి లాభంలేదు. మా ఇద్దరిమధ్యా ఏ విధమైన అపార్థాలున్నా, వాటి అనర్థాలతో

జీవితం తునాతునక లవుతుంది. ఆ భిన్నాల్ని ఇంకేవిధం గానూ జేర్చి సరిదిద్దుకోలేం.

ధైర్యాన్ని కూడపలుక్కున్నాను. చాకచక్యంతో సాధించాల్సిన పని. తొందరపడటం వల్ల పాడవుతుంది; తొందర పడకపోతే మించిపోతుంది!

"నేనొక ప్రశ్న వేస్తాను – జవాబుచెప్తావా?" అన్నాను, ఒక సాయింత్రం.

"నీ ప్రశ్నలు నాకుకొత్తా? నా జవాబులు నువ్వు ఎరుగవా?"

"నేనేమీ బాగుండనని మా స్నేహితురాలంది... నువ్వేమంటావూ?"

"బాగుంటావంటాను"

"అందమైన దాన్నేనా?" తలఊపాడు.

"నన్ను ప్రేమించగలవా?" ఆతొందరలో ఇలా ముఖాముఖీ అడిగేశాను. నోటినుంచి మాటలు బైటపడ్డాక, నాలిక కొరుక్కున్నాను...ఇక అతని జవాబుకోసం ఆతృతతో ఎదురు చూడటం మాత్రం మిగిలింది.

అతను సాలోచనగా లేచి నిలబడ్డాడు.

"ఈ ప్రశ్నకు నేను జవాబుచెప్పను" అన్నాడు, దృఢమైన కంఠధ్వనితో, అతనిముఖంలో, జీవితరహాస్యం యేదో బైటపడినప్పటి బాధలాంటిది కనిపించింది.

"ఎందుకని?"

"అది చాలా అవసరమైన విషయం రాణీ! చాలా బాధాకరమైంది. తెలుసుకోవటంవల్ల ప్రయోజనంకూడా లేదు."

చకచకా వెళ్ళిపోయ్యాడు.

కోపమూ, అభిమానమూ నన్ను ఘోరంగా ముట్టడించి నయి. మూర్ఖంగానాఅంతట నేనే ఎందుకు బైటపడ్డానాది అనిపించింది. అతని దృష్టిలో నేనెంత చులకనైపోయ్యాను! అతను సరైనజవాబు ఇవ్వలేదు. పోనీ — తను నన్ను ప్రేమించటంలేదు అనన్నా చెప్పినట్టయితే ఇంత బాధపడే దాన్ని కాదు. నేనుఏడ్చిపోతానని, ఆనిరాకరణను సూచించ లేదేమో! రోడ్డుమీద కాలికి అడ్డంవొచ్చిన కంకర్రాతిని బూటుకాలితో తన్నినట్టు—అబ్బ! ఎంతకఠినుడు!

లేక 'జానని' చెప్పేధైర్యం లేకపోయిందా? నన్ను ఎంతఘోరమైన సందిగ్ధావస్థలోనికి తోశాడు!...తనేమన్నా పిల్లవాడా? నాకు కలిగేలాంటి ఆలోచనల్ని ఎరగడా? ఈ సమయాన్ని చేతులారా వొదులుకొనే ఉన్నట్టయితే—జీవి తంలో తలక్రిందులుగా తపస్సుచేసయినా, ఇలాంటి ఇంకో ఛాన్సును తెచ్చుకోగలడా? బలవంతాన నా కన్యాత్వాన్నే అవమానించినంతగా బాధపడ్డాను. ఇన్నాళ్ళ బతుకుతో, ప్రేమతో, స్నేహంతో — అతనిముందు ఏశక్తి నాచేత మోకరింపచేసిందో అర్థమవలేదు.

తను నాకులంవాడు కాదని సందేహించాడా ? తెలియదా — ప్రేమకు జాతి, మత భేదాలూ, కులవిచక్షణా లేవని ? అతని చదువూ, సంస్కారమూ ఏ బుగ్గిలో పొయ్యను ? అతనిమీాద ఇంత తెలివి తక్కువగా ఇన్నాళ్ళూ ఎందుకని ఆశలు పెంచుకు కూర్చున్నాను ? 'రాణీ ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వేమంటావోనని నేను ఇన్నాళ్లూ భయపడి ఊరుకున్నాను. కాని, యీా సంఘమూా, ప్రజలూ వీళ్ళ బాధలకు మనం ఆగలేం. ఈ పట్టణం మనకు నివసించ దగినది కాదు. నాతోలేచివొచ్చెయ్. దూర దేశాల్లోని సౌఖ్యానికో, బాధలకో సిద్ధమవ్వు ! అన్నట్టయితే — ఎంత బాగుండేది. అతని వెనుక నరకానికైనాసరే వెళ్ళి ఉండే దాన్ని ! కథల్లో చదివిన మాదిరే అనుకున్నాను. ఈ క్షణం లోనే నేను తల్లిదండ్రుల్నీ, తమ్ముణ్ణీ, అస్థినీ, గౌరవాన్నీ, ఆత్మబంధువుల్నీ, లోకాన్నీ అన్నింటినీ ఇంకో ఆలోచన లేకుండానే త్యాగం చేసి, అతని దయకు వేచికూర్చున్న దాసిలాగు, విశ్వాస పాత్రమైన పెంపుడు కుక్కలాగు పూజించి, సేవించి ఉండేదాన్ని మూాఢుడు ! ఒట్టి దద్దమ్మ— నాకున్న మాత్రం ధైర్య మన్నా లేని పిరికి !

మర్నాటినుంచీ అతను మా ఇంటికి రావటం మానేశాడు. ఇది నాకు మరీ బాధగావుంది. ప్రేమ లేకపోతే పోయె—కనీసం మా పూర్వ స్నేహాన్ని కూడా లెక్క చెయ్య కూడదా ? ఒకసారి నిరాకరించాక, మళ్ళీ వెంట

పడేటంతటి నీచురాల్నీ, అభిమానం లేనిదాన్నీ అను కున్నాడా? నా అనమానాన్ని నాకు ప్రతిరోజూ జ్ఞాపకం చేస్తూన్నట్టుంది. ఒకవేళ నా దేపొరపాటైనా, నన్ను యీ స్వల్ప విషయానికి క్షమించలేడా?

అతని దినచర్యలు కనిపెడుతూనే వున్నాను. ఎప్పుడైనా మా ఇద్దరి చూపులూ కలుస్తే—మొట్టమొదట తప్పించు కోవటం అతని వొంతు! బాధగా చూసి వెళ్ళిపోతాడు. అతన్ని ఏమని అర్థం చేసుకునేట్టు?

మరి మూడు మాసాలకు నా వివాహం స్థిరమయింది. అతన్ని గూర్చి ఎక్కువగా ఆలోచిస్తూండటంవల్ల నావివాహ సమస్యను గూర్చి అసలు ఆలోచించనే లేదు! అతను కాక పోయ్యాక, ఇక ఎవరైతేనేం? ఆ కోపంలో మా ఇంట్లో జీతగాణ్ణయినా అంగీకరించి ఉండేదాన్ని.

నాకున్న స్వాతంత్ర్యాన్ని అమ్ముకో బోతున్నాను. ఇక ముందు ఇప్పటి నేనుగా ప్రవర్తించలేను. నా భర్తకు భార్యగా ప్రవర్తించవలసి వుంటుంది. ఈ చివరి ఘడియల్లో ఇంకొక్కసారి అతన్ని కదిలించి చూద్దామనే ఆశ కలిగింది. చావబోయ్యే వ్యక్తి తన ఆప్తుల ఆశలన్నింటినీ తన మీందికే లాక్కున్నట్టు—నా జీవిత సౌఖ్యపుటాశ లన్నింటినీ ఇంకొక్క సారి ప్రయత్నించి ఆశనో నిరాశనో ఎదుర్కోవాలని నిశ్చ యించుకున్నాను.

మనసులోని కోపాన్ని, రోషాన్ని, దురభిమానాన్ని బాగా శాంతి పరుచుకున్నాను. జరిగిన విషయా లన్నింటినీ మరిచిపోలేకపోయినా—కనీసం మరిచిపోయినట్టుగా ప్రవర్తించేందుకు మనస్సును కుదుట బరుచు కున్నాను.

ఒకనాటి సాయంకాలం అతనిని నా అంత నేనుగా ఇంటికి ఆహ్వానించాను. అతను చాలా ప్రసన్నంగా, మా ఇద్దరిమధ్యా ఏ దుర్ఘటనా జరగనట్టుగా, మామూలుగా వొచ్చాడు. నా ఆహ్వానం కోసమే ఎదురు చూస్తున్నాడా అనిపించిందంటే ఆశ్చర్యంలేదు. సంభాషణను ఎట్లా మొదలు పెట్టాలో అర్థంకాక, కాసేపు అవస్థపడి అన్నాను. "నేను వెళ్ళిపోబోతున్నాను."

"ఎక్కడికీ?" అన్నాడు, ఆతృతగా

"అత్తవారింటికి—"

మనిషి క్రమంగా మామూలుగా ముడుచుకుపోయ్యాడు. సూటిగా నాముఖంలోకి చూడలేదు. తలమాత్రం భారంగా వొంచేశాడు. అతని ఆతృతఅంతా శాంతంగా, గంభీరంగా మారిపోయింది. ఆతను ఎలా అర్థం చేసుకుంటున్నాడో నని ఆతృతగా చూడటం నాభాగంగా మారింది.

"ఎప్పుడు?" అన్నాడు. రెండు నిమిషాలు గడిచాక

"వొచ్చేనెల్లో..."

"మంచిదే!" అని నిట్టూర్చాడు.

సంభాషణ ఆగిపోయింది. మళ్లీ దానిని మొదలుపెట్టటం నాభారంగా తోచింది.

"—కాని, యీ పెళ్ళి నాకు ఇష్టంలేదు."

"మన ఇష్టప్రకారం జరుగుతుందా?"

"ఎందుకు జరగకూడదూ— ఆ మనోధైర్యం ఉండాలి కాని?—"

"జరగదు... జరగదు... అసంభవం!" ఆమాటల్లో ఎంతో వ్యధ కనిపిస్తోంది.

"కారణమేమీ లేదన్నమాట?"

"ఎన్నో కారణాలున్నాయ్. కానివాటన్నిటితో నూబుర్ర చెడగొట్టుకోవటంవల్ల ప్రయోజనంలేదు. జీవితానికి ఎదురీత యీది త్వరలోనే అలిసిపోయి, విరక్తి కల్పించుకోవటం కన్నా, ఆ ప్రవాహంలోనే కొట్టుకుపోతూ, చేతికందే కొద్ది సౌఖ్యంతోనే సుఖపడటం మంచిదేమోననుకుంటాను..."

"నాపెళ్ళి నీకు సంతోషంగా ఉన్నట్టుంది"

"సంతోషానికి ఏముందీ? నా పెళ్ళికూడా నాకు సంతోషంగా వుండదు. లోకంలో అనేకం—మనం అనుకోనివీ, అనుకున్నవాటికి సరిగ్గా తలకిందులు వ్యవహారాలూ— జరిగిపోతూవున్నయ్. ఇష్టంవున్నా లేకున్నా—వాటన్నిటినీ చూస్తూ, అనుభవిస్తూ, తిరిగి తిరిగి పరిస్థితులకు అనుకూలంగా మారుకుంటూ— నవరసాల అనుభూతిలోనూ సాగిపోతున్నాం—"

"సరైన అభిప్రాయాలు చెప్పాలి. డొంకతిరుగుడుగా కోమటిసాక్ష్యం లాగు మాట్లాడటం మానేసి..."

"నేను చెప్పేందు కేముందీ? నీకు నువ్వే ఆలోచించుకో. నీ పెళ్ళివిషయం నన్ను అడగటం దేనికీ?......స్నేహితుడుగా నాసలహాఅంటావా — యీ దేశంలో స్త్రీకి వివాహం అత్యవసరం. తల్లిదండ్రులు ఎప్పుడు వొదిలించుకుందామా అని ఎదురుచూస్తుంటారు. అవివాహిత తనను తను రక్షించుకోలేదు. అందుకని, భర్తచాటున ఇష్టమైనాసరే కష్టమైనా సరే-జీవితాన్ని వెళ్ళబుచ్చుకోవాల్సిందే!"

కోపంతో నా కింది పెదవులు వణికేనై. అతను కనీసం ఓదార్పుగానన్నా మాట్లాడలేదు. మిగతా బంధుమిత్రులందరికీ—నా యీ పెళ్ళి ఎంత ఇష్టంగావుందో, అతనికూడా అలాగే వున్నట్టు సూచించాడు. నన్ను ఆ నరక కూపంలోకి తోయబోతున్నప్పుడుకూడా, సానుభూతిగా, ప్రసన్నతగా మంచిమాటల్తో ధైర్యమన్నా చెప్పలేదు, ఆకాశం విరిగి నెత్తినపడుతున్నా భరించు - అంతకన్నా గత్యంతరం లేదు, అన్నట్టుచెప్పాడు. దారేపొయ్యే ఆగ దానికి ఇచ్చే ఉచితసలహాకన్నా ఎక్కువకు నేను నోచుకోలేదా ? మా స్నేహం—అసలంటూ ఉన్నదా ? ఏశక్తన్నా సహాయపడితే, తప్పుత్రోవను పొయ్యే పశువుకు ఇచ్చే శిక్షను అతనికూడా లభింపచెయ్యాలనిపించింది.

"నేను వొస్తాను—రాణీ!" అని నాజవాబుకన్నా ఎదురుచూడకుండా, అకాత్తుగా వెళ్ళిపొయ్యాడు. ఎంత అహంకారం! ఎంత నిర్లక్ష్యం! ఎంత కృతఘ్నత!!

సంభాషణ మొదట్లో కొద్ది ఆశను మళ్ళీ నాకు సూచించాడు. 'లోకమే అలాటిది — కాని యీ ప్రవాహాన్ని మనం ఎదుర్కోలేం' అనే పిరికితనంతో మాట్లాడాడు. అప్పుడు నేను అనుకున్నాను—మెల్లిగా జాగర్తగా అతనిలో ధైర్యాన్ని కల్పిద్దామని. కాని అకాత్తుగా మళ్ళీ మారిపోయి, నన్ను విదిలించి వెళ్ళిపొయ్యాడు. పది, పన్నెండేండ్ల స్నేహమూ — అతన్ని అర్థంచేసుకునేందుకన్నా నాకు ఉపయోగపడలేదా? మానుముఖంపట్టిన గాయాన్ని నాకు నేనై రేపుకున్నాను.

ఈ బాధలోనే నా వివాహం జరిగిపోయింది. అందుకు నేను విచారించనేలేదు. యాంత్రికంగా, మన అనుమతి లేకుండానే శ్వాసకోశాలు గాలిని పీల్చుకున్నట్టు—ఆ సంఘటన నాలో ఏ ప్రత్యేకభావాన్నీ కల్పించలేదు.

ఊరేగింపురాత్రి కారులోవున్న నన్ను అతను మేడమీది నుంచి చూశాడు. అతని ముఖంలోనూ, కళ్ళల్లోనూ మార్పేమీ లేదు. విచారమూ, సంతోషమూ యీ రెంటినీ కూడా మరిచిపొయ్యాడేమో ననిపించింది. కనీసం ఒక బాల్యస్నేహితురాలు దూరమైపోతుందన్న బాధన్నా లేదు. ఎంత అయోగ్యుడైన వ్యక్తికి నేను నా హృదయాన్ని

అర్పించుకున్నానో బాగా అర్థమైంది. ఈ సందర్భంలో నేనింకా లోతుకుపోనందుకూ, ఇంకా మూర్ఖంగా ప్రవర్తించనందుకూ నన్ను నేను అభినందించుకున్నాను. కళ్ళను మత్తెక్కించిన ఆ ప్రేమతో ఇంకొక్క అడుగు ముందుకువేసి వున్నట్లయితే మరి యీ జన్మకంతకూ తీరనివ్యధకు లోనయ్యేదాన్ని. ఈ ప్రమాదంనుంచి నన్ను కాపాడిన ఆవిధికి మనసారా నమస్కరించాను.

# 3

"నేను అత్తవారింటికి వెళ్ళిపొయ్యేనాడు అతని ఇంటిదాసి ఒక చిన్న పెట్టె తెచ్చి ఇచ్చింది. ఒక ఉత్తరమూ, ఒక చక్కని జార్జెట్ సిల్కు చీరా ఉన్నవి. ఉత్తరంలో "—నీ జీవితాన్ని సౌఖ్యమయం చెయ్యమని విధిని ప్రార్థిస్తున్నాను. ఈస్వల్పకానుకనూ స్వీకరించు. స్నేహితుడు–రవి" అనివుంది.

ఆ కానుక అగ్నిమీద ఆజ్యం పోసినట్లుంది! ఇంతకన్న నన్నుపిలిచి, నాప్రవర్తనకు తిట్టినట్లయితే బాగుండేది. నన్నూ, నాకులీనతనూ, స్నేహాన్నీ అవమానించే ఇంకో మార్గమే అతనికి తోచలేదా? స్నేహితుడు! ఇదేనా స్నేహం? ఇంతకన్న విరోధం వేయిరెట్లు మేలు! స్నేహమనే వొంకమీద జీవితసర్వస్వాన్నీ హరించిన దుర్మార్గుడు!

కానుకను తిప్పిపంపుదా మనిపించింది. కాని అంతకన్న బాగా అతన్ని పరిభవిస్తేనేకాని యీ మంటలు చల్లారేట్లు

తోచలేదు. పన్నెండేళ్ళ నిరాశను ఒక్కసారిగా ఎదుర్కొనేట్టు చేసినవాడికి తగిన శిక్ష విధించేసమయం ఇదొక్కటే నని తోచింది.

''ఆయన్ను ఒకసారి వారి మేడమీదకు రమ్మను'' అన్నాను దాసితో.

దాసి తలతిప్పి వెళ్ళిపోయింది. అతను మేడ పైభాగానికి వొచ్చి నాకోసం ఎదురు చూస్తున్నాడు. రాత్రి తొమ్మిది గంటల సమయం. చంద్రుడు ఉదయిస్తూ గుడ్డి వెలుగుతో భూమిని నింపుతున్నాడు. మనస్సును చిక్కబట్టుకొని మెల్లిగా మేడమీదికి వెళ్ళాను. అతను నావైపే చూస్తున్నాడు. మాటలు చాలా అనవసర మనిపించినయ్.

మెల్లిగా నిప్పుపుల్లగీసి ఆచీరెను అంటించాను. ఆమంటలు నాల్కలు పైకి జాపినకొద్దీ, నాముఖంలోని ఆనందజ్యోతి కూడా పెద్ద దవసాగింది. ఈలోకంలో ఎక్కువగా ద్వేషించే వస్తువు కళ్ళఎదుట బుగ్గవుతూంటే కలిగే సంతోషాన్ని అనుభవించాను. నవ్వాను – మనసారా, గట్టిగా, తృప్తిగా నవ్వాను. నీప్రేమా, నీస్నేహమూ ఇలా వున్నయ్. వాటిని సత్కరించే విధానం ఇదే!' అని అతన్ని పిలిచి వేరే చెప్పాలా? ఇంతకూ అతనిలో కలిగిన భావం ఏమిటో? అసలు అతను బాధపడుతున్నాడో లేదో తెలుసుకోవాలి. అతని వైపు చూశాను.

ఆశ్చర్యం! అతనుకూడా నాలాగే నవ్వుతున్నాడు. అతని ముఖంలో నేను ఎదురు చూసే నల్లదనమే లేదు. అత నంత తృప్తిగా నవ్వటాన్ని చూచి ఆరు నెల్లయింది. నాగురి ఎప్పుడైతే ఇంత ఘోరంగా తప్పిందో, హృదయంలో ఇంకో బాకు గుచ్చుకున్నట్టు బాధతో కుంగిపొయ్యాను. వీధంతా వినపడేట్టు నవ్వే అతని నవ్వును మరి వినలేక, త్వరత్వరగా కిందికి వెళ్ళిపొయ్యాను.

జీవితం కొత్త సమస్యలకు గురైంది. అందులో మొద టిది—యీకాపరం! నాభర్తకు నేను రెండో భార్యను. ఆయన యీడుమించిపోయినా, ఆయన హోదా, ధనమూ భార్యను తేగలిగినయ్. అందులోనూ నాలాటిచదువుకున్న, అందమైనభార్యను ఆయన కోరేందుకు అనర్హుడైనా, ఆవిధి దయవల్ల నేను లభించానని గర్వపడుతూ నాదగ్గర చెప్పు కొని సంతోషపడేవారు.

నాభర్తను చూసికానీ, ఆ సంపదను చూసికానీ నా కెప్పుడూ తృప్తికలగలేదు. అయిష్టతతో యీకాపరాన్ని చేస్తూన్నందుకు ఇదంతా ఒక లంచంగా నాకు తోచేది. లోక కల్యాణార్థం ఇలా యీకాపరాన్ని ఎందుకు చేస్తు న్నానో, ఎలా చెయ్యగలుగుతున్నానో నాకు ఆశ్చర్యం గానే ఉండేది. నామీద నాకు అసహ్యంకూడా వేసేది.

గదిలో చీకట్లో నాఆలోచనలన్నీ రవిమీది కేపొయ్యేవి. కూరగాయలకోడీ హృదయం దగరకు పోవటంలో విశేషం.

లేదని మొట్టమొదటిసారి గ్రహించగలిగాను. మనస్సును తిప్పుకోలేకపోయ్యే అసమర్థత నన్ను బాధించేది. మరీ నా భర్తను రవితో పోల్చినప్పుడు యీలోకమే నాకు నివసించ తగ్గదిగా తోచేదికాదు. ఒక్కొక్కప్పుడు అనుకునేదాన్ని. నాభర్తే రవి అని! అదొక విధంగా తృప్తినిచ్చేది. అందు కని మాటిమాటికి అలా తలుచుకోవటానికి ప్రయత్నించే దాన్ని-యీరకం ఆనందాన్నికూడా ఎక్కువకాలం అనుభ వించలేక పొయ్యాను. మనదృష్టిని ఎంతకాలమని మోస గించగలం? అదీ మోసమని తెలిశాక కూడా!

రవిని క్రమంగా మరిచిపోగలననే ధైర్యం పూర్తిగా విడి పోయింది. అతని తలపువొచ్చినప్పుడు—ఒకవేళ అతను నా భర్తయివుంటే, జీవితం ఎలా గడుస్తూండేదోననే ఆలోచన- హద్దూ పద్దూలేకుండా పెరిగిపొయ్యేది. ఇలా కలలు కనేం దుకు జీవితాన్ని అలవాటు చెయ్యసాగాను. జీవితం కన్నా కలల్లోనే నిర్మలానందం వుందేమో! కాని యీ విధంగా నేను రోజురోజుకూ నాకు తెలియకుండానే రవికి దగ్గరగా జరుగుతున్నట్టు తెలిసేందుకు, చాలాకాలం పట్టింది.

రకరకాలుగానూ మనస్సును మార్చుకునేందుకు ప్రయ త్నించేదాన్ని! ఎవరి మనస్సును వారు మోసం చేసుకో వటం, ఇంకోరి మనస్సును మోసం చెయ్యటం కన్న చాలా కష్టమని వెంటనే గ్రహించాను.

అనారోగ్య లక్షణా లేవీ నాలో లేకపోయినా, యీ పర ధ్యానతను నా భర్త భరించ లేక పొయ్యారు. గుచ్చి గుచ్చి అనేక రకాల ప్రశ్నల్ని వేసేవారు. అప్పుడు నేను అనుకునే దాన్ని: 'మీరు నన్ను పోషిస్తున్నారు. నా సంతానానికి తండ్రిగా ఉంటారు. దానిగ్గాను నేను మీకు కోరిన ఆనందాన్ని ఇస్తున్నాను. మీరు నామీద ఖర్చుచేసే డబ్బు వృధా కావటం లేదు. ఇక నన్ను గూర్చిగానీ, నా మనస్సును గూర్చిగానీ మీరు ప్రశ్నించటమూ, జవాబులకు వేధించటమూ ఎందుకు? అది విప్పి చెప్పటం నా తరంకాదు. అదీ కాక ఇవి ఏవిషయాన్నయితే మరిచి పొయ్యేందుగ్గాను, ఇతర విషయాల్ని నేను కల్పించు కుంటున్నానో వాటిన్నానే మళ్ళీ ఆపాత బాధలన్నింటినీ నామీదికి తేవటమే అవుతుంది. మీకు తెలియ కుండానే నన్ను బాధించ గలుగుతారు!'

ఒక్కొక్కప్పుడు యీ విషయాల్ని చెప్పేద్దామా అనిపించేది. కాని, అలా చెప్పి వారికి నామీద వున్న అభిమానాన్ని కూడా పోగొట్టుకోవటం—ఇంకో కష్టాన్ని కొని తెచ్చుకోవటమే! అనుకని కుంటి గుడ్డి జవాబుల్తోనే బైట పడేదాన్ని. కొన్నాళ్ళకు అసలు నా తత్వమే ఇంత కాబోలు ననే అభిప్రాయం వారికి ఏర్పడ్డది!

పదిసంవత్సరాల వరకూ నేను పుట్టింటికి వెళ్ళలేదు. నా భర్తకూ, నాన్నకూ భేదాభిప్రాయాలు రావటం ఒక

కారణం. వెళ్తే, మళ్ళీ రవిని చూడాల్సి వొస్తుందనీ, ఆ మైకంలో ఏదో వొకటి చేసి, మళ్ళీ గాయాన్ని ఇంకోసారి రేపుకోవాల్సి వొస్తుందనీ—లోకంలో ఎక్కడికి పోయినా ఒకటేననీ నేనూ ఊరుకున్నాను.

ఇలాగని రవిని తలచని రోజు లేదు. అతను ఎలామారి వుంటాడో ఊహకు అందినంతవరకూ ఆలోచించేదాన్ని. అమ్మకు రాసేఉత్తరాల్లో అతన్ని గూర్చి అడిగేదాన్ని. ఆమె ఇలా రాసింది. "అతని తండ్రి చనిపోయాడు. ఆస్థి పాస్థులన్నీ మరి రెండుమూడు తరాలవరకూ సరిపడేట్టుగావున్నా, అతను ఆ వ్యవహారాలన్నింటినీ చూసీ చూడకుండా ఉన్నాడు. ఈ మధ్య కవిత్వంకూడా రాస్తున్నాట్ట! మనిషి బాగా తీసి పోయ్యాడు. అన్యమనస్కంగా ఉంటాడు. ముఖంలో ఉత్సాహ మేమీ కనిపించదు. గదిలో ఒంటరిగా కూర్చొని ఏదో చదువుకుంటూ ఉండాడు. అతను ఒక పిచ్చివాడు అయ్యాడేమోనని నా సందేహం!"

నాకు గుండె ఆగినట్టయింది. రవిపిచ్చివాడా! అతని స్థితి నా ఊహకు అతీతమైంది. చదువుకునే రోజుల్లో ఎంతో తెలివిని ప్రదర్శించేవాడు. పిచ్చిలోకూడా—తెలివైన పిచ్చి ఉండొచ్చు! ఇంకా గుచ్చి అడిగేందుకు భయపడి ఊరుకున్నాను.

అమ్మరాసిన ఉత్తరం చదివినప్పట్నుంచీ రవిని చూడాలనే కుతూహలానికి గురయ్యాను. అతని జీవితాన్ని

యీవిధంగా తలక్రిందులుచేసిన సంఘటన ఏదై వుంటుందో అర్థం కాలేదు. నేను అనుకున్నాను. అతను మళ్ళీ మామూలు మానవుడిలాగే పెళ్ళిచేసుకొని, పిల్లల్ని కంటాడని. నా ప్రేమను నిరాకరించినా, తన ప్రేమను ఇంకో స్త్రీకన్నా ఇవ్వగలడను కున్నాను... ఇచ్చాడేమో? అక్కడ తను నిరాకరించబడి ఇలా తయారయ్యాడేమో! నిజంగా ఇలాగే జరిగి వున్న ట్లయితే, నాస్థితి కొంతవరకూ అతను అర్థం చేసుకో గలుగుతాడు!

నాన్నకు ప్రాణంమీదికి వొచ్చిందనే టెలిగ్రాం వొచ్చాక కాని ఆయన నన్ను పుట్టింటికి పంపలేదు. నేను ఇల్లుజేరేప్ప టికి, చూపులుకూడా అందేస్థితి గడిచిపోయింది.

ఆ దుఃఖంలో పదిహేనురోజులు గడిచిపోయినయ్. ఆతరు వాత ఇంకో పదిరోజులన్నా ఉండేందుకు నిశ్చయించు కున్నాను.

రవినిగూర్చిన ఆలోచనలు మళ్ళీ నాలో పనిచేయసాగి నయ్. మేడమీాదిగదిలోజేరి అతన్ని కనిపెట్టసాగాను. అతను తన మేడమీాది కిటికీదగ్గరగా కుర్చీలోపడుకొని ఏదో దీర్ఘంగా చదువుతూండేవాడు; లేదా ఏదో రాసుకుంటూండేవాడు. రోజులో అతనిలా ఎన్నిగంటలు గడుపుతున్నాడో కనిపెట్ట గలిగేశక్తి నాకు లేకపోయింది.

ఇలా చాటుగా కనిపెట్టడం మొదలెట్టాక, అతను అనేక సార్లు నన్ను చూశాడు. నా చూపులు తనను భంగపరిచి

నట్టు చోటు మారేవాడు. నాలుగైదు రోజులదాకా యీ వ్యవహారం నాకు అంటుపట్టలేదు.

నిజాన్ని బైటికి లాగాలని, వాళ్ళ ఇంటిదాసి చేతులో ఒక రూపాయి పెట్టాను. అది నాకు పుట్టబోయ్యే సంతానంతో కూడా కలిపి సన్ను దీవించింది.

"అయ్యగారి స్థితి ఏమిటీ?" అన్నాను.

"ఏమోనమ్మా! ఎప్పుడూ ఆగదిలోనే చదువుతూనో, రాస్తూనో వుంటారు. కాలకృత్యాలు తీర్చుకునేందుకు మాత్రం కిందికి వొస్తారు. ఎప్పుడన్నా బైటికి వెళ్ళినా — ఏవో పుస్తకాలు కొనుక్కొని త్వరగానే ఇంటికివొస్తుంటారు-"

"మరి భోజనం?"

"హోటల్ నుంచి తీసికొచ్చి ఆగదిలో పెట్టి పోతాను. ఎప్పుడు తింటారో తెలియదు. ఒక్కొక్కప్పుడు కారియర్ లో భోజనమంతా అలాగే ఉండిపోతుంది".

"బాబుగారు పెళ్ళి చేసుకోలేదేం?" అన్నాను.

"ఏమోనమ్మా! పెద్ద పెద్దసంబంధాలువొచ్చినయ్. గొప్ప గొప్పోళ్లు తిరిగిపోయారు. ఆయనకు పెళ్ళిమాటంటే గిట్టదు."

"ఆయనకు పిచ్చా?"

మొదట అది కాస్త భయపడ్డది. తరువాత అంది: "నాకు తెలియదు. పిచ్చిఅనే చాలామంది అంటారు. కాని పిచ్చిగా మాట్లాడటంకానీ, పిచ్చిచేష్టలుకానీ నే నెప్పుడూ గమనించలేదు. ఎప్పుడైనా స్నేహితులు వొస్తూంటారు. బాగానే మాటాడుతారు—."

"స్నేహితులు చాలామంది ఉన్నారా?"

"పదిపన్నెండు మంది ఉంటారు. అందులో నలుగురు ఆడవాళ్ళు కూడాను."

"ఆడవాళ్ళా?"

'ఔ' నన్నట్టు తలవూపింది.

"బాగుంటారా?"

"చాలా బాగుంటారు" కళ్ళుమూసుకొని ఒక్క గుటక మింగింది.

"వాళ్ళకూ్కడా పెళ్ళిళ్ళు కాలేదా?"

"నాకు తెలియదమ్మా! బాగా చదువుకున్న వాళ్ళే! ఇంగ్లీషు కూడా మాట్లాడుతారు."

"రాత్రిళ్ళు ఆయన ఇంట్లోనే ఉంటారా?"

"ఒక్కోరాత్రి ఎక్కడికో పోతారు. తెల్లారు తూంటగా వొచ్చి పడుకుంటారు. మధ్యాహ్నం రెండు జాముల పొద్దెక్కేకగాని లేవరు."

"ఆయనకు తాగుడుకూడా అలవాటుందా?"

"నాకు తెలియదు"

"ఏ స్త్రీతో నన్నా సంబంధం వుందా?"

"నా కెలా తెలుస్తుంది?" అని కాస్త ఆగి, "పెద్ద వాళ్లెవరూ లేరామె! ఆయనకు తోచదు... పెళ్లి చేసుకొని హాయిగా ఉండక..." అని మిగతా మాటల్ని పైకి రానివ్వలేదు.

ఇంతకు మించి దాసీదాని ద్వారా తెలిసినేదేమీ లేదు. ఒకసారి అతనితోనే మాట్లాడదామనిపించింది. దాసీదాని

ద్వారా ఒక చీటీ పంపాను: "మీతో ఒకగంట మాట్లాడాలనివుంది. దయచేసి ఒకసారి మా ఇంటికి వొస్తారా ?"

దానికి జవాబు వొచ్చింది: "రాను. అత్యవసరమైతే ఒంటి గంటకు నాగదికి రావొచ్చు—"

దీనికి జవాబేమిరాయాలో నాకు తోచక, దాసీదాన్ని పంపేసి, ఆలోచలో పడ్డాను. రవి ఇంత కఠినుడుగా ఎందుకు మారాడు ? బహుశా అతను ఇంకెవర్నన్నా ప్రేమించి ఉండొచ్చు. దాసీదాని మాటల్ని పట్టిచూస్తే ఇది స్పష్టమౌతోంది. నేను చూడని ఆ వ్యక్తుల మీద ఈర్ష్య పుట్టింది.

ఇదంతా అలావుంచి — అతన్ని ఒక్కసారి ఇక్కడికి రమ్మంటే—రాకపోను—పైపెచ్చు నన్నే తన గదికి రమ్మన్నాడు. ఎంత ధైర్యం ! నన్ను కులీనను, సంసారిని, ఎంత స్నేహితుడైతే మాత్రం—అర్ధరాత్ర సమయాన తన గదికి రమ్మంటాడా ? నామాట అంటే అంత చులకనా ? నేను అతని దృష్టికి అంత హీనంగా కనిపిస్తున్నానా ? ఛీ — స్నేహం అనేదాన్ని అసలు నమ్మవొచ్చా ?

ఇంకో అనుమానం కలిగింది. ఒకవేళ అతను నన్నే ప్రేమిస్తున్నాడేమో ? ఆ ప్రేమ వాక్యాల్ని నాచెవిని వేసేందుకు, తీరుబడిగా అర్ధరాత్రి రమ్మన్నది అందుకేమో ? పిరికి పడి నేను కల్పించిన అవకాశాలన్నింటినీ వొదులుకొని, అవ్వి అవకాశలనే మాటను తరువాత గ్రహించి, విచారంతో కుంగి పోతున్నాడేమో? ఇక ఇప్పుడు తనకుతానై

యీ అవకాశాన్ని కల్పించుకున్నాడేమో? అతనికి నా మీద ఏమాత్రం వాంఛవున్నా ఇట్టే బుట్టలోవేయవచ్చు. అర్ధరాత్రి వెన్నెలవెలుగులో ఒంటరిపాటు జీవితానికి ఎక్కువగా అలవాటైనవాణ్ని, రెచ్చగొట్టే అందమూ, చాకచక్యమూ నాలో లేవా? ఇలా అనుకునేందుకు అనేక అవకాశాలున్నయ్. ఇలాగే జరుగుతే నా పూజలఫలం వృధా కాలేదనే తృప్తన్నా ఉండకపోదు!

ఈ ఆలోచన నాలోని ఉత్సాహాన్ని రేపింది. కాని ఆత్మాభిమానం వెనక్కులాగటం మొదలుపెట్టింది. నేను ఒంటరిగా అర్ధరాత్రి అతని గదికివెళ్తే—అది ఎవరైనా చూస్తే—ఎంత చులకనైపోతాను! ప్రేమికులు దొంగల్లాగు అర్ధరాత్రికోసం వేచికూర్చోవటమూ భయంతో అభిమానంతో—ఆ సౌఖ్యాన్ని వొదులుకోలేని మనస్సుతో ఎంత బాధపడుతూంటారో బాగా అర్థమైంది. అతను బాల్యమిత్రుడు. సంస్కారి. మీదుమిక్కిలి నా జీవితపు టాశలకు పునాది...ఐతేమాత్రం? అసలు వెళ్ళకపోవటమే మేలనిపించింది. కాని వెళ్ళకుండా, యీఒక్కఅవకాశాన్నీ—మూర్ఖంగా వొదులుకుంటే — జీవితమంతా యీజారిపోయిన సంఘటననుగూర్చి బాధపడటం మాత్రం తథ్యం! వెళ్ళినంతమాత్రాన అత నెందుకు చులకనచేస్తాడు? అందువల్ల అతనికేంలాభం? ఇక ఇతరుల దృష్టిపడకుండా చూసుకోవటం నావొంతు!

రోడ్డుమీదికి వెళ్ళే అలవాటున్నా లేదు...ఎందుకు వెళ్ళ కూడదు ? కాని, ఆ భయం—ఒక పాడుపని చేసేప్పుడు అంతరాత్మ తన్నుకుంటూ మూలిగే మూలుగు—నా వెంట పడ్డది. దీనికి కారణం—ఆ చేసేపనిలోని దుర్మార్గమై ఉండదు; అది దుర్మార్గమనే మన గాఢనమ్మకం మాత్రమేనేమో?

రోడ్డుమీదికి తొంగిచూశాను; మార్పేమీ లేదు ఏమైనా వెళ్ళకతప్పదు. అందులోనూ ఇంత ద[illegible] వొచ్చాక ! వాళ్ళఇంటికీ మాఇంటికీ మధ్య ఎనిమిది [illegible] దూరమైనా—అది ఎనిమిది మైళ్ళనిపించింది. నాకు [illegible] పడే బాధకన్న, ఎవరైనా చూసిపోతారేమోననే కొత్త బాధ వెన్నాడసాగింది...బరువైన కాళ్ళను శక్తికొద్దీ యీడ్చుకుంటూ, యీపనిచేసేది మనంకాదనే కొత్తరకం ఆలోచనమీద దృష్టినిలిపి—మేడమెట్లన్నీ ఎక్కాను, చివరి మెట్టుమీదినుంచి కాలుతీశాక—ఒక సముద్రాన్నే యీది వొచ్చిన వ్యక్తిలాగు ఒక్కనిట్టూర్పు విడిచాను.

అతని గదిలోకి ప్రవేశించటం చాలా కష్టమనిపించింది. నేను వొక సామాన్యస్త్రీని అయినా ఇంత బాధవుండేది కాదు. కులీనను కావటంవల్ల సామాన్య మానవుల హక్కులూ, అవకాశాలూ, అధికారాలూ కూడా నాకు దూరమై పోయినయ్.

ఆబైటనే నిలబడిపొయ్యాను. గదిలోంచి టైంపీస్ టిక్-టిక్ లు మాత్రం స్పష్టంగా వినిపిస్తున్నయ్. నన్ను

నాకు చేతనైనంతగా అలంకరించుకున్నాను — అతన్ని పూర్తిగా ఆకర్షించాలని. నాకు అందకుండా అతను ఎలా దూరంగా జరిగాడో, అలాగే అతన్నికూడా ఆశ పెడుతూ ఏడిపించాలనే వాంఛ తీవ్రంగా పనిచేస్తోంది.

ఇంతా ఏడుస్తే — నామీది అభిప్రాయాన్ని అతను మార్చుకోలేదేమో? నాకు నేనై ఆలోచించటంవల్ల, నా ఇష్టంవొచ్చినట్టుగా అతన్ని సృష్టించుకుంటున్నానేమో? ఇలాంటి విషయాల్లో పొరపాటు పడే అవకాశం ఎంతైనా వుంది. ఏమైనా నాకు జరగబొయ్యే హాని యేమీలేదు. ఒక స్నేహితుడు రోడ్డుమీద ఎదురైనప్పుడు ఇష్టమున్నా, లేకున్నా పలకరించినట్టూ, యోగక్షేమాన్ని విచారించినట్టూ ప్రవర్తిస్తే సరిపోతుంది.

చాలాసేపటినుంచీ అతని గదివైపు చూస్తున్నాను. ఎలక్ట్రిక్ లైట్ దేదీప్యమానంగా వెలుగుతోంది. అతను పడకకుర్చీలో అటూ ఇటూ దొర్లుతూ అమితఉత్సాహంతో ఏదో చదువుతున్నాడు. నారాకకోసం ఎదురు చూస్తున్నాడేమో? 'వొస్తాను' అనన్నా రాయని మూర్ఖురాల్ని!...

రోడ్డుమీద జనసంచారం లేదు. చలికి ముడుచుకొని పడుకున్న కుక్కలుమాత్రం దూరన ఎక్కడో అప్పుడప్పుడు అరుస్తున్నయ్. ఒంటిగంట దగ్గరకు గడియారం ముల్లు జరుగుతూ నన్ను తొందరచేస్తోంది. కాని పిరికితనంకూడా మెల్లిగా వెంటపడుతోంది. అర్ధరాత్రప్పుడు ఇలా ఒంటరిగా

రోడ్డుమీదికి వెళ్ళే అలవాటన్నా లేదు...ఎందుకు వెళ్ళ కూడదు? కాని, ఆ భయం—ఒక పాడుపని చేసేప్పుడు అంతరాత్మ తన్నుకుంటూ మూలిగే మూలుగు-నా వెంట పడ్డది. దీనికి కారణం-ఆ చేసేపనిలోని దుర్మార్గమై ఉండదు; అది దుర్మార్గమనే మన గాఢనమ్మకం మాత్రమే నేమో?

రోడ్డుమీదికి తొంగిచూశాను; మార్పేమీ లేదు. ఏమైనా వెళ్ళకతప్పదు. అందులోనూ ఇంత దూరం వొచ్చాక! వాళ్ళఇంటికీ మాఇంటికీ మధ్య ఎనిమిది గజాల దూరమైనా—అది ఎనిమిది మైళ్ళనిపించింది. నాకు నేను పడే బాధకన్న, ఎవరైనా చూసిపోతారేమోననే కొత్త బాధ వెన్నాడసాగింది...బరువైన కాళ్ళను శక్తికొద్దీ యీడ్చుకుంటూ, యీపనిచేసేది మనంకాదనే కొత్తరకం ఆలోచనమీద దృష్టినిలిపి—మేడమెట్లన్నీ ఎక్కాను, చివరి మెట్టుమీదినుంచి కాలుతీశాక—ఒక సముద్రాన్నే యీది వొచ్చిన వ్యక్తిలాగు ఒక్కనిట్టూర్పు విడిచాను.

అతని గదిలోకి ప్రవేశించటం చాలా కష్టమనిపించింది. నేను వొక సామాన్యస్త్రీని అయినా ఇంత బాధవుండేది కాదు. కులీనను కావటంవల్ల సామాన్య మానవుల హక్కులూ, అవకాశాలూ, అధికారాలూ కూడా నాకు దూరమై పోయినయ్.

ఆబైటనే నిలబడిపోయ్యాను. గదిలోంచి టైంపీస్ టిక్-టిక్‌లు మాత్రం స్పష్టంగా వినిపిస్తున్నయ్. నన్ను

రమ్మన్న సంగతే అతనికి జ్ఞాపకంలేదు కాబోలు! నిర్ణీత కాలం దాటిపొయ్యాకకూడా ఒకసారి బైటికివొచ్చి చూడ కూడదా? నాఅంతట నేను నాగదిలో ప్రవేశించటం కన్న, అతనేవొచ్చి నా చెయ్యిపట్టుకొని తీసుకు వెళ్ళకూడదా?... అంత అదృష్టమూ?

పదేళ్ళ తరువాత వొచ్చిన స్నేహితురాల్ని కనీసం ప్రసన్నతగానన్నా చూడటం తెలియదా? అదీ—ఆమె తనంతతానుగా తన ఇంటికి వొచ్చినప్పుడు! నేనంత హీనంగా చూడబడుతున్నానా? అసలు స్నేహానికి ఎక్కువ తక్కువలతో పనేముందీ?

—కాని అతని ఉత్తరానికి 'ఔ'నని కానీ, 'కాదు' అని కానీ నేను జవాబు రాయకపోవటంవల్ల యీ ప్రమాదం సంభవించి ఉండొచ్చు. ఏజవాబూ రాకపోవటాన్ని అతను నిరాకరణగా తీసుకునేందుకు ఎంతైనా అవకాశంవుంది. ఈకారణం నన్ను బాగా సమాధాన పరిచింది...

## 4

ధైర్యంగా గదిలోకి తొంగిచూశాను. ఈలోకాన్నే వొదిలి దివ్యసమాధిలోవున్న యోగిలాగు, అచంచల దృష్టితో చదువుతున్నాడు.

ఇలా బైట నిలబడటం చాలా ఇబ్బందిగా తోచింది. మెల్లిగా లోన ప్రవేశించాను. నారాక అతనికి తెలిసినట్టుగా

లేదు. ఇక కాలయాపన భరించరానిదైంది. మెల్లిగాదగ్గాను.

చప్పున తలతిప్పాడు.

''ఎవరూ? రాణీ!...రా...కూర్చో!''

ముఖంలో పెద్దమార్పేమీలేదు. పుస్తకం మూసివేయబడ్డది. నూతనంగా వొచ్చిన వొక అతిథిని సత్కరించే విధానంలాగు కనిపించింది. ఇద్దరమూమాట్లాడలేకపొయ్యాం.

కూర్చున్నాను. అతనేమన్నా మాట్లాడుతాడేమోనని ఎదురుచూస్తున్నాను. కాని, శూన్యంలోకి చూసినట్టుగా—జాలిగా, బాధగా, దీనంగా, పిచ్చిగా నాముఖంలోకి చూడసాగాడు. కాదేమో? అలా చూశాడని నాకు అనిపించి వుంటుంది!

''కులాసాగా ఉన్నావా?'' అన్నాడు కాస్తఆగి.

''ఆఁ ఇన్నాళ్ళకు నాక్షేమం సంగతి గుర్తొచ్చిందా?''

''నువ్వు ఇక్కడ లేనప్పుడుకూడా విచారిస్తుండేవాణ్ని''

''ఉహుఁ.'' అన్నాను. ఈమాటలునాకంతతృప్తికరంగా లేవు. ఎందుకంటే, నా పరోక్షంలో అత నెలావున్నా, నా సమక్షంలో మాత్రం అలాటి చిహ్నాలేవీ కనిపించటంలేదు.

''రెండువారాలుగా నావైపన్నా చూడలేదు—''

''చూశాను. కాని వెంటనే పోల్చుకోలేక పొయ్యాను. చాలాసార్లు చూశాక కాని, నువ్వని తెలుసుకోలేక పొయ్యాను''

5

"అంత మారిపొయ్యానా?"

"లేదు—కాని నాకు దృష్టిమందగించి వుంటుంది—"

"ఎందుకని?"

"ఎక్కువగా చదవబట్టి"

"డాక్టర్ను చూడలేదా?"

"చదవొద్దంటాడు, రాత్రిళ్ళుత్వరగా నిద్రపొమ్మంటాడు"

"పోనీ నిద్రపోరాదా?"

"ఎలా? కావాలంటే నిద్రవొస్తుందా? ఒంటరివాణ్ని ఏంతోస్తుంది కనుకా? ఈ పుస్తకాలే నాకు స్నేహితులు. వాటితోనే అలసిపొయ్యేదాకా కాలక్షేపం చేస్తుంటాను"

"పోనీ పెళ్ళిచేసుకుంటే యీ వొంటరితనం వొదిలి పొయ్యేదికదా!"

నవ్వుతాడనుకొన్నా కాని, నవ్వలేదు.

"పెళ్ళాడ దలుచుకోలేదు"

"ఎందుకనీ?"

"చాలా కారణాలున్నయ్"

"చెప్పకూడదా?"

కాస్సేపు ఇంటికప్పుకేసి చూసి అన్నాడు: "కూడనిది యేమీలేదు. మనిషిజీవితంలో ఒకేసారి గాఢంగా ప్రేమించగలడు. ఆతరువాత ప్రేమఘట్టాలున్నా, అక్కడకూడా అంత గాఢంగానూ ప్రేమించినట్టు తోస్తుంది. కాని విఫలమై పోయిన ఆప్రేమ—"

మధ్యలోనే అందుకొని, "నువ్వు ప్రేమించావా ? ప్రేమించగలవా ? ఎవర్నన్నా హృదయ పూర్వకంగా ప్రేమించే శక్తి నీలోవుందనే నమ్మకం కనీసం నీకన్నా వుందా ?" హేళనగా నవ్వాను.

నానవ్వు ఆగాక, 'ఎందుకు ప్రేమించలేనూ ?' అన్నాడు.

"నాకా నమ్మకమే లేదు. పోనీ ఎవర్ని ప్రేమించావ్ ? అది ఎందుకని నిష్ఫలమైంది ?"

"అదంతా నేను చెప్పను. ఎందుకంటే, ప్రేమవుంటే దాన్ని డబ్బావాయించక్కర్లేదు. జాగర్తగా హృదయంలోనే దాచుకొని అనుభవించేశక్తిని సంపాయిస్తే సరిపోతుంది. అదీకాక, అది రహస్యమైన నావ్యక్తిగత జీవిత విశేషం. దాన్నిగూర్చి అడిగే అధికారం ఎవ్వరికీలేదు. జవాబు ఇచ్చితీరాల్సిన బాధ్యతకూడా నాకులేదు."

"కోపంవొచ్చినట్టుంది !"

"లేదు..."మామూలుమనిషిగా మారిపొయ్యాడు.

"పోనీ నువ్వుప్రేమించింది—స్త్రీ నేనా ?"

తలవూపి, "ఇంక ఆ ప్రేమసంగతిని వొదిలేద్దాం. నీకు అదంతా చెప్పేసమయం ఇంకారాలేదు..." అన్నాడు.

"నాకు తెలుసు !" అన్నాను.

"ఎట్లా తెలుసూ ?"

"నేను ఊహించగలను—"

"ఇక నన్ను అడగటం దేనికి ?"

ఈ జవాబుతో సగంచచ్చాను. ఇక ముందుకుపొయ్యే దారి కనిపించలేదు. అందుకని సంభాషణ చీలివొచ్చిన చోట అందుకున్నాను.

"నువ్వు పెళ్ళిచేసుకోనందుకు ఇంకేంకారణాలున్నయ్? మొదట ప్రేమించినంత అందమైన అమ్మాయి మళ్ళీదొరక లేదా?" అన్నాను.

"అందమా? ప్రేమించిన వ్యక్తిలో కనిపించినంత అందం, మరెక్కడన్నా కనిపిస్తుందా? ఒక్క అందాన్నే గురిగా పెట్టుకుంటే, జీవితమంతా లోకాన్ని గాలించినా ప్రేమించలేకపోవొచ్చు. ఎందుకంటే యీనాడు చూసిన అందంకన్న, అందమైనది రేపు దొరకొచ్చు!"

"కవిత్వం మాట్లాడుతున్నావ్!"

"రాణీ! అది ఏ కవిత్వానికీ, ఏ కలానికీ లొంగదు. ఏయుగంలోనూ, ఏకవీ దాన్ని తృప్తికరంగా చెప్పలేదు. ఒకవేళ చెప్పినా, అది పాఠకుణ్ని ఆ ఉన్నతశిఖరాలకులాక్కు పోలేదు. ఆ అనుభవాన్ని అనుభవించి తెలుసుకోవాల్సిందే కాని, భాషలో, మాటల్లోచెప్పి అర్థంచెయ్యలేం..."

నేను మౌనంగాకూర్చొని వింటూ ఆలోచిస్తున్నాను.

"—నేను పెళ్ళిచేసుకొని మాత్రం సుఖపడేదేముందీ? ఇంత కన్న ఘోరమైన జీవితం వెంటపడేది. పెళ్ళామూ, పిల్లలూ—వాళ్ళ గోలా, జబ్బులూ, వాళ్ళ ఆనందమూ, ఏడ్పులూ, నవ్వులూ—అన్నింటినీ పంచుకోవాలి, నాబొక్కడి

జీవితాన్నీ యీదలేక, నేనే బాధపడుతూ—నా అసమర్థతను కప్పి పుచ్చుకొని, మరికొన్ని జీవిత భారాల్ని మీద వేసుకోవటం మూర్ఖ్యం! ఇష్టంలేని ఆ పెళ్ళితో నేనింకా కుంగిపొయ్యేవాణ్ని...ఇక ఒంటరి తన మంటావా — దాన్ని దూసుకు నేందుకే యీ పుస్తకాలు. అవన్నీ నేను చెప్పినట్టు వింటయ్. వాటి బాధ నాకేమీ లేదు. ఒక స్త్రీని భార్యగా స్వీకరించి—జీవిత మంతా కష్టపడి నేర్చుకున్నా — ఒక ఉద్గ్రంథం ఇచ్చే విజ్ఞానమన్నా దక్కదు.''

నేను అదిరి, ''భార్య విజ్ఞానం కోసమా ?'' అన్నాను.

''కాక—అజ్ఞానం కోసమా ?''

''భార్య !...భార్యగానే ఉండేందుకు !—''

''ఆ విషయం భార్యాత్వానికి అలవాటు పడ్డ నీకే తెలియాలి ?''

మరికొన్ని నిమిషాలు మౌనంలోనే గడిచి పోయినయ్.

''చాలామంది స్నేహితురాళ్ళను సంపాయించావుటే?''

''నిజమే! నువ్వు ఎగతాళిగా మాట్లాడినా—''

''ఎవరన్నారూ—ఎగతాళని?''

''నీకంఠమే చెప్తోంది. నేనంత రసికుణ్ని కాకపోయినా, ఆమాత్రం గ్రహించుకోలేనా? ఇందులో హాస్యాస్పదమైన విషయం ఏముంది కనుకా? స్నేహితులెంతో, స్నేహితురాళ్ళూ అంతే! మనిషికీమనిషికీ మధ్యఏర్పడే అభిమానంతో నిండిన స్నేహాన్ని అపార్థం చేసుకోవటం దేనికి? నువ్వు

కూడా నాకు స్నేహితురాలివే కనుక—ఆ స్నేహితురాళ్ళం దరికీ వర్తించే హాస్యాస్పదమైన అభిప్రాయాల్లో నీ కూడా భాగం వుండక పోదు—''

''నాలాటి స్నేహమూ వాళ్ళతోనూ ఐతే-''

''కాక? ఇంకాస్త ఎక్కువదూరం పోయినా, దాన్ని కూడా స్నేహమనే అంటారు; కొత్త పదమేమీ లేదుగా!''

''కాదు...ప్రేమ...అంటారు!''

''ప్రేమనుగూర్చి ఇంతకు ముందే చెప్పానుగా! ఇంకా బాగా అర్థమయ్యేట్టు చెప్పేందుకు మరి కొంతకాలం పడుతుంది.''

'ఇంతకూ నన్ను ప్రేమిస్తున్నావా? లేదా?' అని అడిగే ధైర్యం నాకు లేదు. నేను అనుకున్నట్లు జరిగే సూచన లేమీ కనిపించటం లేదు, అసలు వస్తువుచిక్క లేదు; యని ఛాయ కోసం చెయ్యిజాపుతే, అదీ దొరక లేదు. ఎడారిలో దాహంతో బాధపడే పాంథుడికి, ఎండమావులు చూపే ఆశలాటిది నన్ను మాటిమాటికీ వేధించి, యీస్థితికి లాగింది. ఇంతకన్న పూర్తినిరాశ ఎంతైనా ఎన్నుకో దగ్గది!

''ఇంక వెళ్ళనా?'' అన్నాను.

''అంత తొందరేం రాణీ! ఐనా నువ్వొచ్చిన పనేమిటో అడక్కుండానే ఊరుకున్నాను.''

''పెద్దపనేమీ లేదు. కులాసాగా మాట్లాడుతూ, పాత స్నేహితుడితో ఒక్కరాత్రన్నా గడుపుదామని...''

తృప్తిగా సంతోషంతో నవ్వాడు.

"ఇంకా తెల్లారేందుకు మూడుగంటలుంది — యీ ఒక్కరాత్రి నువ్వు నాతోగడిపినందుకు, నాజీవితంలోని తుది రాత్రులన్నీ నీతోనే గడుపుతాను—"

"నాకు అర్థమవటంలేదు."

"తర్వాత అర్థమౌతుందిలే... రాణీ! మాట్లాడు... నవ్వు! ఆనవ్వుల్లో మనకు తెలియకుండానే కాలాన్ని ముందుకునెట్టుకుపోదాం. రోజులు ఎలాగడుస్తయ్యా అని ఎదురుచూడటం తప్ప — ఇంకోవిధంగా జీవితాన్ని ఉపయోగించుకోలేకపోతున్నాం—"

"కవిత్వంరాస్తున్నావుటే ?"

"అంతకన్న ఏంచెయ్యనూ ? అచ్చయిన పుస్తకాలిస్తాను. చదువుదుకానిలే—"

తర్వాత ఏమేం మాట్లాడేమో నాకు బాగాగుర్తులేదు. బాధాపూరితమైన నాసంసారిక జీవితానికి సానుభూతిగా మాట్లాడుతూ ఒక్కసారన్నా కౌగలించుకుంటాడేమోనని ఆశించాను. ఆతన్ని ఉద్రేకపరచటంకూడా లాభంలేని పనని కనిపెట్టేందుకు ఎక్కువ ఆలస్యంకాలేదు. రంభా, ఊర్వసులు మునులను వశపరుచుకునేందుకు ఏ అస్త్రాల్ని వాడిలారో నాకు అంతుపట్టలేదు. ఇప్పటికే యీఓటమితో బాధపడుతున్నాను. ఇంకా ముందుకుపోయి, తిరిగి తిరిగి ఓడుతూ ఇంకా కుంగిపోవాల్సివొస్తుంది. రవిహృదయం ఏ గండుశిలలతో చేయబడ్డదో ?

చంద్రుడు అస్తమిస్తూ కోపంతో ఎర్రనయ్యాడు. మాట్లాడి నంతసేపూ లోలోన కుంగిపోతూనేవున్నాను.

"ఇక వెళ్తాను" అన్నాను.

"మంచిది...రాణీ ! యీస్నేహితుణ్ని మాత్రం మరిచి పోబోక. మన స్నేహం చాలాపవిత్రంగా ఉంటూవొచ్చింది, రేపు నువ్వు నీభర్తముఖంలోకి, ధైర్యంగా, మామూలుగా చూడగలవు. తప్పుపనిచేసి ఆత్మపడేబాధ నిన్ను తాకదు... అర్థమైందా—మనస్నేహం ?"

"ఆ ఆత్మఘోషే నయం !" అన్నాను,

"ఇప్పుడు ఆలాగే అనిపించవొచ్చు. ఒడ్డున కూర్చొని ప్రవాహం వేగాన్ని, నదిలోతునూ చూపుల్తోకొలిచినట్టు—"

చెప్పే వేదాంతమైతే ఉన్నతశిఖరాలమీద వుంది కాని, నాలోని రక్తమాంసాలూ, చీమునెత్తుర్లూ చేసే తిరుగు బాట్లకు లొంగిపొయ్యాను; తిరగబడటంకన్న, కోర్కెలకు బానిసగా మారిపోవటమే తేలికనిపించింది...ఏమైనా రవి మీద నాకు కోపంపోయింది. దానిస్థానే ఒక గౌరవం ఏర్పటడం మొదలుపెట్టింది. మనం చెయ్యలేనిపనిని తేలిగ్గా చెయ్యగలిగేవాడు మనదృష్టిలో పొందేస్థానంలాటిది—

జీవితంలో మొట్టమొదటిసారి మనసారా అతనికి నమస్క రించాను. నా రెండుచేతులూ పట్టుకొని, "ఒద్దు-రాణీ ! అలా ఎప్పుడూ నమస్కరించవొద్దు. నువ్వు అనుకునేటంత గొప్ప వాణ్ని మాత్రం కాదు—"

అలాగే కొన్ని నిమిషాలు శిలాప్రతిమల్లాగు నిలబడి పోయ్యాం. రవిమీద గొప్ప సానుభూతితో కూడిన గౌరవం క్షణక్షణానికీ నాలో పెరిగిపోయింది. జీవితాన్ని ఇలా ముళ్ళ కంపల్లోకి లాక్కున్నాడేం ? ఎవరికోసం ? ఎందుకు ? అతను సుఖపడినట్టయితే, నాబాధ కొంతవరకన్నా తగ్గేదేమో ! నాకు తెలియకుండానే కళ్ళు నీరుకార నారంభించినయ్.

రవి తన ఉత్తరియ్యంతో నీరు అద్దుతూ ''రాణీ ! పరిస్థితులు అనుకూలించవు. లేకుంటే ప్రతిరాత్రీ నీతో మాట్లాడుతూ గడిపేవాణ్ని...ఇంకా ఇక్కడ ఎన్నాళ్ళుంటావ్?'' అన్నాడు.

''రెండు మూడు రోజులు—''

''కాని మళ్ళీవొచ్చేందుకు ప్రయత్నించవోక. నీ పరువు మర్యాదల్ని, నీ సతీత్వాన్ని—అన్నింటినీ నాకోసం—యీ వృద్ధుడికోసం 'రిస్క్' చేయవొద్దు. అసలు అనుభవంకన్న, ఆ అనుభవం ఇచ్చే తియ్యని తలపులు ఎక్కువ ఆనందాన్ని ఇస్తయ్. అనుభవం కొన్ని క్షణాలదైతే, దాన్ని గూర్చిన ఆ మధురతమ ఊహలు కొన్ని సంవత్సరాల వరకూ పని చేస్తయ్...రాణీ! ఇక వెళ్ళు...ఇంకొక్కటి చెప్పాలనుకున్నాను. నేనే మీ ఇంటికి వొచ్చేవాణ్ని. కాని అత్తవారింటికి వెళ్ళేనాడు—నేను పంపిన కానుకను నువ్వు తగలపెట్టావ్—''

"అందుకు నన్ను క్షమించు" అని తలవొంచి ఏడ్వ సాగాను.

"అంత బలహీనత్వానికి లొంగవోక...ఆనాడు నేను నిజంగా మనసారా నవ్వాను. ఎందుకంటే. నామీది కోప మంతా, నీభర్తమీది అనురాగంగా మారే అవకాశం వుంటుందనీ, క్రమంగా నీ దాంపత్యజీవితం సౌఖ్యమయ మవుతుందనీ—"

నేనంటే రవికి ఇంత అభిమానమని ఎప్పుడూ అనుకో లేదు.

"—కాని అలా జరగ లేదు"

"జరక్కపోవచ్చు. ఈనాడు నిన్ను రమ్మనంగానే, యీ స్నేహితుడికోసం వొచ్చావు. అప్పుడే నేను అర్థంచేసుకో గలిగాను. నువ్వు సుఖపడటంలేదని. మన గురి తప్పవొచ్చు. కాని గురిలోనే తప్పుఉండటం—"

నాలో మాట్లాడేశక్తులన్నీ మూగవోయినయ్.

"సరే...ఇక వెళ్ళు రాణీ! అతిథిని సాగనంపుతాను"—

చాల రోజుల్నుంచీ ఆకలిదప్పుల బాధకు గురైనవ్యక్తి లాగు గొప్ప బలహీనం నన్ను ఆవరించింది. నరాల పటుత్వం పూర్తిగా కోల్పోయి నట్టనిపించింది. నన్ను పట్టు కొని మెల్లిగా మేడమెట్లన్నీ దించాడు.

"ఇక వెళ్ళేందుకు అనుజ్ఞా?" అన్నాడు.

ఏడ్చాను. హృదయంలో దాగలేని బాధకు ఇదొక్కటే దారేమో?

"వెళ్లు రాణీ! పిచ్చిపిల్లవు కావొద్దు. ఇప్పటికూడా నన్ను అర్థంచేసుకొని ఉండవు. ఒకనాటికన్నా తెలియకపోను... ...కాని, మన స్నేహాన్నిమాత్రం మరిచిపోవొక-"

"మరిచిపోగలనా?...ఒక్కటి చెప్తావా?...కనీసం నన్ను ప్రేమించావా?"

నాముఖంలోకి సీరియస్‌గా చూశాడు. "రాణీ! ఆసంగతి మరిచిపొయ్యేందుకు ప్రయత్నించు. తెలుసుకోవటంవల్ల కొత్తసమస్యలకు గురికావాల్సి వొస్తుంది..."

ఇంకేం అడగాలో నాకు తోచలేదు.

"రాణీ! ఇక వెళ్ళు. తెల్లారుతోంది" అన్నాడు.

వీధికుక్క వికారంగా అరిచింది. బరువెక్కిన హృదయంతో, నిరాశ వెన్నాడిన అలసటతో ఇంటికి వొచ్చాను. రవిమాటల అర్థం నామెదడుకు అందేస్థితిలో లేదు. మహావేగంతో ప్రవహించే నది కొండలోయల్లోకి ప్రవేశించి, అటూ ఇటూవున్న మహాపర్వతాల్ని భేదిద్దామని చేసేవ్యర్థ ప్రయత్నంలాగు, ఆలోచనలన్నీ వృథాగా కనిపించినయ్. శారీరికంగా పొందిన ఆ అలసటలో ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

## 5

"జీవితం కొత్తదార్లలో నడుస్తోంది. రవి నన్ను అభిమానిస్తున్నాడని గ్రహించిన నాటినుంచీ, నా స్వాప్నిక జీవితం వన్నె చిన్నెలతో, సరిక్రొత్త రంగుల్తో పెంపొందసాగింది. ఇప్పుడు మా ఇద్దరిమధ్యా ఉత్తరాలుకూడా నడుస్తున్నయ్. నా క్షేమాన్నిగూర్చి మాత్రం అతను అడిగేవాడు; అవ్వి ప్రణయలేఖల్లైనా బాగుండేవి. అవ్వి రవి రాశాడనే తృప్తి తప్ప, ఇంకోరకం ఆనందాన్ని ఇచ్చేవి కావు.

ఈమధ్య అతని రచనలు చదివాను. స్త్రీ హృదయాన్ని ఎంతో గొప్పగా అర్థం చేసుకొనినట్లు వ్యక్తమైంది. కాని, అతను అర్థంచేసుకోలేంది, నన్నొక్కతెనేనేమోననే అనుమానంకూడా కలిగింది. హృదయాన్ని విప్పిచెప్పకున్న స్త్రీకి నాగతేనా అనిపించింది.

జీవితం నిస్సారంగా గడిచిపోతోంది. ఈ జీవితభారాన్ని కాలం దానంతట అదే లాగిపారేస్తోంది. మభ్యపడి హృదయాన్ని ఆశాపూరితం చేసుకోగలిగిందికూడా యేమీలేదు.

రవిని తలవనిరాత్రిలేదు. ఒక్కోనాడు వింతవింత కలలు కూడా వొచ్చేవి. మెళుకువరాగానే, ఆనిద్రనూ, ఆకలనూ యీ వాస్తవిక జగత్తు ఎంత పాడుచేసిందో అర్థమయ్యేది. కాని అదికల అనీ, అంతాగారడీమాయలాగు భ్రమపడ్డాననీ వెంటనే తెలిసిపోయ్యేది. చివరకు కలలోపాటి ఆనందమనా

వాస్తవిక జీవితంలో లేదని గ్రహించేందుకు ఎంతో సేపు పట్టేదికాదు. ఆ తెగిన కల మళ్ళీ ఆరంభమైతే బాగుండునని పించేది. కనీసం కలలన్నా మన ఇష్టప్రకారం వొచ్చి పోతూంటే, జీవితం ఇంత వెగటనిపించదేమో?

కళ్ళుమూసుకొని రవిని నాపక్కనే సృష్టించుకునేదాన్ని. ఎంత ఆనందం! అతను ఎలాటి కంఠధ్వనితో మాట్లాడు తాడో, దాన్నికూడా సృష్టించుకునేదాన్ని. క్రమంగా అతని ప్రణయ సంభాషణలనుకూడా ఊహించుకునేదాన్ని. సరిగ్గా ఇలా జరుగుతుందనికానీ, జగిగే అవకాశమన్నా వున్నదని కానీ కాదు. ఎలాజరుగుతే బాగుంటుందో, అలా ఊహించు కునేదాన్ని. ఆ ఊహలు నన్ను ఆకాశంలోకి, మనం చూడ లేని ఆనందమయ ప్రదేశాల్లోకి లాక్కుపొయ్యేవి. మళ్ళీ ఏదో మామూలు ధ్వని నన్ను ఆ ఉన్నత శిఖరాల్లోంచి కింద పడేసేది. ఇలాటి ధ్యానానికి ఏ నిర్జన ప్రదేశమో ఎంతైనా ఉపయోగపడేదికదా అనిపించేది.

మార్పులేని జీవితానికి యాంత్రికంగా అలవాటై పొయ్యాను. బాగా అలవాటు పడ్డదారిన, ఎద్దు — బండి తోలేవాడి అనుజ్ఞకూడా అవసరంలేకుండా — తనంత తానుగా బండిని యీడ్చుకుపోయి గమ్యస్థానాన్ని జేరుస్తూ న్నట్టు—ప్రతిరోజూ, పనులన్నింటినీ, చేసుకుపొయ్యేదాన్ని. ఇది తలుచుకున్నప్పుడు — ఇంత నిరుపయోగంగా, ఇంత బాధాకరంగా ఎలా బతకగలుగుతున్నానా అనిపించేది.

ఎలాబతుకుతున్నానో అర్థమైతే, బతకటమే ఒక విషమ సమస్యగా ఉండేదేమో ?

బంధుజనంమీాది మక్కువ బాగా తగ్గిపోయింది. నా మీాదనే నాకు అసహ్యం కలగంగాలేంది, ఇతరులమీాది అభిమానం తగ్గిపోవటంలో ఆశ్చర్యంలేదు. రవిలాంటి స్నేహితుడే నన్ను అన్యాయం చేయగాలేంది, ఇతరులు కలిగించే బాధలు కానీ, మనోవ్యథలుకానీ అసలు లెక్కకే రావేమో?

ప్రత్యేక సంఘటనలేమీా జరక్కుండానే రెండేళ్ళుగడిచి పోయినయ్. మరికొన్ని నెలలకు నేనొక బిడ్డతల్లి నయ్యాను. వయసుమీారాక కొడుకు పుట్టటంవల్ల నాభర్త ఆనందానికి మితిలేదు. ఈ దేశంలో ప్రతిస్త్రీ చెయ్యగల యీాఒక్క ఘన కార్యాన్నీ చేసినందుకు నేను గర్వపడలేదు కాని—తల్లిగా వాణ్ని ప్రేమించసాగాను.

రవికీ వీడికీ పోలికలున్నయ్యేమోనని చాలాసార్లు ఆలోచించాను. పోలికలు నిజంగా ఉన్నవోలేవో కాని- నాకు మాత్రం ఉన్నట్టే కనిపించేవి. వీడే రవి కుమారుడైతే ! ఈతలపు వొచ్చినప్పుడు నాభర్తమీాద ఎంతో అసహ్యభావం కలిగేది.

క్రమంగా నా జీవితపుటాశలన్నిటినీ యీా కుర్రవాడిమీాద నిలుపుకునేందుకు ప్రయత్నించసాగాను. నా చిన్నతనమంతా ఎలా గడిచి పోయిందో ఇప్పుడు అంతగా గుర్తు లేదు. ఈ బిడ్డను చూసి ఇలాగే గడిచి వుంటుందని మాత్రం అనుకునే

దాన్ని. చిన్న తనంలో బొమ్మల ఆటతో కాలం గడిచేది. కాని అది ప్రాణం లేనిదనీ. మనం ఎంత తెలివిగా, గొప్పగా దాని ముందు ప్రవర్తించినా అది నవ్వలేదనీ, నవ్వించ లేదనీ తెలుసుకో గలిగాక. ఆ బొమ్మను విసిరి పారేశాను. కాని మన తెలివి తేటలు పెరిగినట్టే, ప్రకృతి కూడా ఇంకో రకం మోసానికి మనను తయారు చేసినట్టు, ప్రాణం వున్న యీ బుల్లి బొమ్మను ప్రసాదించింది. ఇది మన లాగే నవ్వగలదు; నవ్వించగలదు. దుఃఖిస్తుంది; దుఃఖింప జేస్తుంది. ఏమైనా యీ పిల్లవాడి జీవితపు లోతుల్లోకి అమాయకంగా దిగిపోవటంవల్ల, జీవితపు భారం కొంచెం తగ్గి పోయిందనే చెప్పాలి.

నా దృష్టినీ, నా సేవనూ వీడెల్లా లాక్కోగలుగుతున్నాడో ఆశ్చర్యంగానే వుంది! ఎన్నోరోజుల పరిచయం వున్న వ్యక్తు లందర్నీ నెట్టేసి, ఆ స్థానే వీణ్ని ఎలా నిలుపుకో గలిగానో, బహుకొద్ది పరిచయం వున్న యీ కొత్త వ్యక్తి నన్ను ఎలా ఆనంద పెట్ట గలుగు తున్నాడో నాకు తెలియదు. పాతబడ్డ పరిచయం కన్న కొత్త పరిచయానికే ఎక్కువ విలువ వుంటుందనే వాదనలో కూడా నాకు సత్యం కనిపించ టంలేదు. ఎందుకంటే, యీబిడ్డ తరువాత పుట్టబొయ్యే బిడ్డలమీదా, రోజూ పుడుతూన్న బిడ్డల మీదా నా దృష్టి మళ్ళి ఎరుగదు.

ఒక్క కారణం మాత్రం నాకు నిజమనిపిస్తుంది. ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా, వీడిలో రవిఛాయలున్నట్టు

నాకు బాగా అనుమానం. అది బాగా నాటుకు పోయింది. నిజమైన జీవితంలో ఏవ్యక్తికి దగ్గర్లో ఉండలేకపోయ్యానో, అదంతా యీ బిడ్డద్వారా తీర్చుకో గలుగు తున్నాననుకుంటాను. కలలో తీర్చుకోర్కెలకన్న, వాస్తవిక జీవితంలోని ఒక ఆత్మబంధువు ద్వారా తీర్చుకోర్కెలకు ఎక్కువ విలువ ఎందుకు ఉండదు ?

ఇలా ఒడిలో పడుకో బెట్టుకొని, రవిని ఒక్కసారన్నా ముద్దాడే భాగ్యం నా జీవితానికి లేదు. ఒకవేళ ముద్దాడినట్టయితే, రవి ముఖంలో ఏ ఛాయ కనిపించేదో, నాఊహకు సూటిగా అందని విషయం. కాని, యీ బిడ్డలాగే అతను కూడా ముద్దుగా నవ్వవొచ్చు...నిజంగా అలాగే నవ్వినట్టనుకునేదాన్ని !

వీడు కూడా పెరిగి పెద్దవాడౌతాడు. ప్రణయ ఘట్టాల్లోకి దిగకమానడు; నిరాశను ఎదుర్కోకా తప్పదు. ఇన్నాళ్ళు ఇంత గుడ్డిగా యీ నిరాశను ఎదుర్కోనేందుకు బతికినందుకు చాలా విచారిస్తాడు; కాని చావలేడు. నాలాగే బాధ పడతాడు. ఇది ప్రతి జీవితానికీ తప్పని సంఘటనే నేమో ?... ఇదంతా తలుచు కునేందుకే భయంకరమైన సంఘటన ! కాని తలుచుకోకుండా ఉండటం ఎలా ?

కుర్రాడు దినదిన ప్రవర్ధమానమౌతున్నాడు. వాడి చిలిపి చేష్టల్ని గూర్చి, వాడి ముద్దుమాటల్ని విని, ఎన్నో క్రొత్త

విషయాలు ఇప్పుడే తెలుసుకుంటూన్నట్టూ, పిల్లలు లేని వాళ్ళకు వాటన్నింటినీ చెప్పి, నా ఆనందంలోని భాగాన్ని ఇద్దామనే తోచేది. ఉదయాన మెయిల్ తీసుకొచ్చే ప్రపంచ వార్తలంత ... తోచే యీ సంఘటనలన్నింటినీ రవికి రాస్తూండే దాన్ని. అతను నానుభూతిగా కుర్రాణ్ణి ఆశీర్వదిస్తూ జవాబురాశేవాడు. వీణ్ని గూర్చి రవి ఏమను కుంటున్నాడో నాకు అంతుపట్టేది కాదు.

మరి పదిసంవత్సరాలకల్లా విధవనయ్యాను. ఇంటిభార మంతా నాపై నేపడ్డది. వెనక్కు తిరిగిచూసే బాధ్యతా, అందుకు తగ్గ ఊహా లేని జీవితాన్ని గడిచి—ఇప్పుడు వెనుక ఏముందో చూసుకుతీర వలసిన పరిస్థితి ఏర్పడ్డది. నాజీవితంలో అప్పులవాళ్ళు తప్ప మరో ఆత్మబంధువే కనిపించ లేదు. ఇలా ఎందుకు జరిగిందో నన్నవిషయంకన్న, ఇక ముందు ఏంజరగాలో, ఏంజరగబోతోందో నన్నసమస్య ముఖ్య మైంది.

ప్లీడర్ను చూశాను. ఆయన యేమీలాభం లేదన్నాడు.

పుట్టింటినుంచి సహాయంవొచ్చే సూచన లేమీలేవు. పైన పెద్దవాళ్ళెవరూ లేకపోవటంవల్ల మాతమ్ముడు తెలుగు సినిమాపరిశ్రమను ఉద్ధరించేందుకు ప్రస్తుతం మహాపట్టణా ల్లోని రోడ్లన్నీ మహాజాగర్తగా తణిఖీచేస్తున్నాడని కడపటి వార్త. ఈక్లిష్టపరిస్థితిలో వాడుకూడా ఇక్కడికి వొచ్చి ఈ

అక్కగారి ఇంట్లో బిచాణాపరచకపోవటం నా అదృష్టాల్లో వొకటనుకున్నాను.

నాకు మిగిలిన ఆత్మబంధువల్లా ఒక్కరవి. సలహాకోసం అతనికి ఉత్తరం రాశాను. జవాబుగా చెప్పుకోదగ్గ దేమీ లేదు; ఒక్క వెయ్యిరూపాయలకుమాత్రం చెక్ వొచ్చింది.

నేను జవాబురాశాను. "నీదయకోసమూ, సానుభూతి కోసమూ నేను వేచికూర్చోలేదు. తెలిసినవాడివని, నాకో మంచిసలహా ఇస్తావని రాశాను—అంతే!"

ఇది జవాబు: "నేను ఇవ్వగలిగే సలహాకూడా నీకు సహాయకారిగా ఉండదు"

దూరం ఆలోచించాను. నిజానికి నాపరిస్థితి చాలా ఘోరంగానే వుంది. ఉన్న సమస్యలకు బీదరికం వొకటి తోడయ్యె! మొదటినుంచీ మంచిరకం జీవితానికి అలవాటు పడ్డ నాకు ఇది భరించలేనంతగా తోచటంలో ఆశ్చర్యం లేదు. ఇక గత్యంతరంలేక రవిసలహానే అనుసరించాను.

రవి నన్ను ప్రేమిస్తున్నాడనీ, విశేషంగాఅభిమానిస్తున్నాడనే ఊహకు ఇదొక చక్కనిఅవకాశంగా కనిపించింది. కాని ప్రేమకూ డబ్బుతో సహాయపడేందుకూ ఎలాంటిసంబంధం వుందో ఆలోచించాను. బోగందాని ప్రేమకోసం పెద్ద పెద్ద ఆస్తుల్ని త్యాగంచెయ్యగలిగిన మహానుభావులు జ్ఞాపకానికి వొచ్చారు. ఒకస్త్రీ ప్రేమకోసం సూర్యుడు అస్తమించని సామ్రాజ్యాన్ని వొదులుకున్న చక్రవర్తీ, ఒక ఆడ

దాని ప్రేమకోసం కోట్లరూపాయిల విలువగల తాజ మహాల్‌ను నిర్మించిన చక్రవర్తి గుర్తుకొచ్చారు. అలాటిదే ఇతని ప్రేమకూడా ఐఉండొచ్చు. కాని ఆచక్రవర్తులుతాము అనుభవించబోయ్యేదానికీ, అనుభవించిన దానికీ— వెలగా కృతజ్ఞతగా ఆ ధనాన్ని వెచ్చించారు. రవి విషయంలో అలాటిదేమీ కనిపించదు. అతను నన్ను వాంఛతోనన్నా తాకలేదు. నానుంచి అతనుపొందిన సౌఖ్యమేమీ లేదేమో? ఇక పొందపొయ్యేది ఉంటుందనే నమ్మకంకూడా లేదు. ఇక నాకు యీవిధమైన సహాయం ఎందుకుచెయ్యాలి? నేనెవర్ని? అత నెవరు? కనీసం ఒక వేశ్యనయినా బాగుండిపొయ్యేది. అప్పుడు అతను నన్ను నిస్సహాయంగా, అసమర్థురాలినిగా, నిరుపయోగమైన ప్రాణిగా చూడగలిగేవాడు. ఇలాధర్మంగా డబ్బు పారేసేవాడుకూడా కాదు. తను అనుభవించే సౌఖ్యానికి బజారు వెలనో, లేక తన దృష్టితో తాహతుకు తగిన వెలనో ఇచ్చివుండేవాడు. ధర్మమనే మిషమీదనే యీసహాయం జరిగినట్టయితే – నాకన్న యోగ్యులైనవాళ్ళు ఎంతో మంది లోకంలో ఉన్నారు. ఇప్పుడు వృధాగా అతని దయను అంగీకరించాల్సి వొచ్చింది. అంతకన్నమరి గతిలేదు. అంగీకరించిపడే యీ బాధసంగతేమిటీ? ఇంత సుడిగుండపు సమస్యల్లోకి రవి నన్ను తోస్తాడనుకోలేదు!

ఇక ముందు జీవితాన్ని ఎంతో జాగ్రత్తగా గడపాలి! అత్యవసరాల్ని మాత్రమే తీర్చుకుంటూ యీ పదేళ్ళకుర్రాణ్ణే

పెంచి పెద్దనుచేసి, వాణ్ణి ఒక ప్రయోజకుణ్ణిగా చెయా ల్సిన బాధ్యత నాకువుంది...

ఖర్చు తగ్గిద్దామనే ఆలోచనమీద, పల్లెపట్టునివాసాన్ని మార్చుద్దామనుకున్నాను. రవికి యీసంగతి తెలియపరిచాను. అతను జవాబురాశాడు!

"జీవితంలో వాతావరణం తీసుకురాగలమార్పుఎంతైనా వుంది. ఇలా ఎన్నిరకాల వాతావరణమైనా అవసరం కావొచ్చు. ఈ విశాల ప్రపంచంలో ఇది ఎన్నివిధాలుగా నన్నా సాధ్యం! నువ్వు మార్పును కోరినట్టయితే, దానికి ఆలోచించాల్సిందేమీలేదు – వెంట నేమారిపో–"

పల్లెటూరికిమారాను. మనస్సుకు కొంత శాంతి చిక్కింది. కొత్త స్నేహితులూ, కొత్త మనుష్యులూ, కొత్త వాతావరణమూ–అదంతా ఇంకో లోకమేమో నన్నట్టుంది. మనుష్యులందరూ ఇంత కలిసిమెలిసి ఉండే సంఘం వుందా అనే అనుమానంకూడా కలిగింది.

రవినికూడా వొచ్చి నాతోనే ఉండమని ఎంతో వేడుకుంటూ ఉత్తరంరాశాను. త్వరలోనే వొస్తానని వాగ్దానం చేశాడు. మళ్ళీమళ్ళీ రమ్మని రాస్తూవొచ్చాను. వాగ్దానాలు తప్ప క్రియారూపాన అతనిటురాలేదు. అతను నాదగ్గరవుంటే ఎన్నో బాధల్ని మరిచిపోగలిగేదాన్ని; కాని నేను అతనిదగ్గర వుంటే మరికొన్ని బాధలు అతన్ని వెన్నాడుతయ్యేమో?

రోజూ సూర్యుడు ఉదయిస్తూనేవున్నాడు; మళ్ళీ యథా ప్రకారంగా అస్తమిస్తున్నాడు కూడాను. ఎవరెట్లావున్నా ప్రకృతిమాత్రం తన మామూలు పనులకు భిన్నంలేకుండా సాగిపోతూనేవుంది. నాకుమాత్రం మొయ్యలేని భారాన్ని లాగుతూ అతి నెమ్మదిగా నడుస్తూన్నట్టనిపించేది. సుఖంగా జీవించటం యేమిటో నేర్చుకునేందుకు బదులు, బాధ పడటమూ, ఆబాధను ఓర్చుకుంటూ అలవాటవటమూ నేర్చుకుంటున్నాను; కాని జీవితంలో బాధే నిజమైన మంచి అనుభవమని వేదాంతులు చెప్తారు. ఇది నిజమే కావొచ్చుకాని, దానిక్కూడా పరిమితి వుండాలికదా! తిరిగి ఉపయోగంలోకి రాని అనుభవం ఎంతవుంటే మాత్రం ఏంచేసుకోను?

క్రమంగా ప్రతివిషయంలోనూ శ్రద్ధ తగ్గిపోతూవుంది. లోకంలో నన్ను సంతోషపెట్టగల సంఘటనలు మరిలేవనీ. రావనీ . గట్టినమ్మకం ఏర్పడిపోయింది. మరి యీ ఎడారి జీవితాన్ని ఇంకెందుకు సాగించాలో అర్థంకాలేదు...ఒక్క యీ కొడుకుకోసమేనని తోచేది. ఒక్కొక్కప్పుడు అనుకునే దాన్ని. చివరకు యీకుర్రాడిమీది మమతకూడా క్రమంగా తగ్గిపోతుంది. అప్పుడు జీవించేందుకు మరి నాకు మిగిలే దేముందీ? ఏకాకిగా కింద భూమీ, పైని ఆకాశమూ చూస్తూ బతకగలగటానికి— నాహృదయం ఇంకా గడ్డ కట్టుకు పోలేదామె!... దైవప్రేరణవల్ల ఇలా జరగకుండా ఉండాలని కోరుకునేదాన్ని.

జీవితంలో వాస్తవికాన్నే అనుభవించి వుంటాను. ఆ వాస్తవికం ఇక నామీంద పనిచేసేట్టులేదు; బాగా పాతపడి పోయింది; అదీకాక, మోతాదు పెద్దదై మొహంమొత్తింది కూడాను. అందుకని దృష్టిని — అందని అసత్యం వైపు మరల్చాను. అదే-దైవభక్తిని వృద్ధిచేసుకోవటమని నా దృఢవిశ్వాసం!

కుర్రాడు చదువుకుంటున్నాడు. వాడి ఆటల్లో, పాటల్లో కాలం వెళ్ళబుచ్చుతూండటంవల్ల నాకు కొంత మనశ్శాంతి కలిగేది. నాస్థితి ఎక్కడ బైటపడిపోయి వాడి చిన్న హృదయాన్ని గాయపరుస్తుందోనని వాడి ఎదుటమాత్రం జాగర్తగా లేని నవ్వుముఖంతో సంచరించేదాన్ని.

ఈడుకు మించిన ముసలితనమేదో నన్ను ఆవరించిందని నా అనుమానం. నిజానికి దేహంలో పటుత్వం ఉండొచ్చు. యవ్వనంకూడా తన తుదిదశలో ఇంకా తొంగిచూస్తూండవొచ్చు. కాని ముసలిదాన్నయిపోయ్యాననే నానమ్మకం - నన్ను వయస్సులో ఎంతో ముందుకు తోసుకుపోయింది. నమ్మకమే ఏర్పడాలికాని, లోకంలో సాధ్యం కానిదేముందీ?

కుర్రాడు కాలేజీవిద్యాభ్యాసానికి వెళ్తానన్నాడు. ఏ ఒక్క వ్యక్తిమీద ఆశలన్నీ నిలుపుకున్నానో, వాడుకూడా దూరమయేట్టున్నాడు. నేను ఒక్కతెనే కనుక, వాడితోకూడా వెళ్దామా అనుకున్నాను. కాని, వాడిచదువులగోలతో స్నేహితుల సరదాల్తో నావైపుచూసే తీరికన్నా వాడికివుంటుందా

అనే సందేహం కలిగింది. రవి కాలేజివిద్యార్థిగా ఉన్నప్పటి ప్రవర్తనను నేనింకా మరిచిపోలేదు. కాలేజీకి వెళ్ళాక, గొప్ప మార్పువొస్తుందనే గొప్పనమ్మకం నాలో నాటుకు పోయింది. అదీకాక, యీ మారుమూలగ్రామమే మిగతా ప్రదేశాలకన్న ఎంతో మంచిదిగా నాకుతోచింది. ఇక్కడ జీవితాన్ని మభ్యపెట్టి బాధించే వాతావరణం చాలా తక్కువ. అసలే ఇతర్లమీద ఆధారపడి జీవితాన్ని గడుపుతూన్న రోజులు; వారికి ఇంకా బరువైపోవటం నాకు ఇష్టంలేదు. మేమిద్దరమూ పట్టణవాసానికి వెళ్తే ఖర్చు ఇంకా పెరగొచ్చు...నేను నిజంగా ఒంటరినైపొయ్యాననీ, నాకు ఆత్మబంధువు తోడుకావాలనీ రవిని వేడుకుంటే, అతనిక్కడికి రావొచ్చనే ఆశ వొకటి మనోకాశంలో దూరాన మెరుపులాగు మెరిసింది.....అందుకని వాణ్ని దూరాన ఉంచేందుకే నిశ్చయించాను.

వాడు వెళ్లిపొయ్యాక నేను పొరబడ్డానేమో ననిపించింది. బావురుమనే ఇంట్లో ఏం ఆలోచనలు కలుగుతయ్ ? దూలాలమీది సాలీళ్ళగూళ్ళుతప్ప ఇంకేమీలేవు ! ఇంత కన్న జైలు ఎంతోనయం; పక్కఖైదీల గోలతోనూ, కాపలాదార్లు పెట్టే బాధతోనూ ఎంతకాలమన్నా దొర్లిపోతుంది.

జీవితం మరీభారంగా తోచింది. రవికి మళ్ళీ ఉత్తరం రాశాను. నేను ఇక జీవించటం కష్టమనీ, ఇంత చప్పబడ్డ

జీవితాన్ని యీడ్చుకుంటూ పోగలశక్తి నాకిక లేదనీ, యీ ఒంటరిపాటుకన్నా మృత్యువే ఎన్నోరెట్లు దగ్గరిగా వుంటుందనీ —కనీసం నా యీతుదిదశలోనన్నా నాదగ్గరఉండమనీ— ప్రార్థించాను,

# 6

"త్రనువాస్తూన్నట్టు రవి రాసినఉత్తరం అందుకున్న నాడు, వయస్సు పదిసంవత్సరాలు వెనక్కు జరిగినట్టనిపించింది. శరీరంలో ఏదో కొత్తశక్తీ, ఉత్సాహమూ, ప్రవేశించినయ్. ఇక నాకు మంచిరోజులు ప్రారంభమైనవనే నమ్మకం కలిగింది. నిరాశపడ్డ జీవితాన్ని గూర్చిన ఆలోచనలన్నీ, ఆశాపూరిత జీవితాన్ని గూర్చిన ఆలోచనలుగా మారినయ్.

—కాని, రవిని చూసినప్పుడు నాలోని ఉత్సాహమంతా ఇంకిపోయింది. అతను వయస్సులో నాకన్న మూడు, నాలుగుసంవత్సరాలే పెద్దయినా — నాతండ్రికి ఉండాల్సినంత వయస్సులో ఉన్నట్టు కనిపించాడు. అతని ఆరోగ్యమంతా, అనారోగ్యమైపోయి ఉండొచ్చు. ఏదో చెప్పలేని బాధల్తో కుంగిపోతూ ఇలాఅయిపోయ్యాడేమో—పాపం !

''ఎంత చిక్కిపోయ్యావ్ ! ఎంత మారిపోయ్యావ్ !'' అన్నాడు, నన్నుచూసి. ఇలాంటి సానుభూతివాక్యాల్నీ, అను

రాగపూరిత కంఠధ్వనిని విని ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళుఅయింది! తనను గూర్చిన సానుభూతేలేదు కాబోలు! తన స్థితిని గుర్తించకుండా, నాస్థితినే గుర్తించాడు—ఎంత అమాయకుడు!

"నేనేమంత మారిపోయ్యాను? మీరు ఎంత అనారోగ్యంలో ఉన్నారో తెలుసుకోనట్టుంది!"

"నేనా?" అని నవ్వి "అది సరేకాని, నన్ను 'మీరు' అనటం ఎప్పట్నుంచీ?" అన్నాడు.

"ఒకో_స్త్రీ గౌరవపూర్వకంగా ఒకవ్యక్తి నేసంబోధించగలదు. ఆ అర్హత గలవారిని ఆమె 'మీరు' అంటుంది-"

"మీరు అని తిరిగి పిలిపించుకోవాలనా?"

"నన్ను వాక్యం పూర్తి చెయ్యనీయండి...ఆమె'నువ్వు' అనే పిలిపించుకోవాలనికూడా కోరుతుంది...తెలుసా?"

"స్త్రీనిగూర్చి నువ్వు ఏంచెప్పినా నేను నమ్మాల్సిందే... ఎందుకంటే నేను స్త్రీని కాదుకనుక!?"

సహజమైన ఆ హాస్యాన్ని అనుభవించకుండా ఉండలేకపోయ్యాను. నామీద విముఖతను ప్రదర్శించకపూర్వం అతను ఇలాగే మాట్లాడేవాడు. ఎంతో కాలాన్ని యీ విధంగా నేను కులాసాగా గడపగలిగేదాన్ని ... మళ్ళీ ఆ వెనుకటి రోజుల్లోని గుర్తొస్తున్నాడు.

"ఆరోగ్యం చాలా పాడైపోయింది. నేనిక బతికేది ఒక సంవత్సరం లోపేనని డాక్టర్లు చెప్పారు!"

నాగుండె గుభేలుమంది.

"మీరలా నిరాశపడకూడదు. చావు బ్రతుకులసమస్య డాక్టర్ల చేతుల్లోలేదు. సరైన పోషణ లేకపోవటంవల్ల ఇలా అయిపొయ్యారు...ఏమైనా, ఆ చావునుగూర్చి మాత్రం నాముందు మాట్లాడకండి...అదంటే నాకెంతో భయం! దాన్నిగూర్చి ఆలోచించటం భయానకం!"

"ఆ భయం నీకొక్కతెకే ననుకుంటున్నావ్. చావుకు భయపడనివారెవరూ? కాని అదిగురితప్పని ఉరితాడనికూడా అందరికీ తెలుసు. అందుకని భయపడటంవల్ల లాభంలేదు"

"పోనిండి. ఇప్పుడు అదంతా దేనికీ? మీరిక ఇక్కడే ఉండిపోండి. భగవత్ కృపవల్ల మీకన్నా నేనే ముందుగా యీలోకాన్ని దాటుతే ఎంతైనా అదృష్టవంతురాల్ని!"

"అదెలా జరుగుతుందీ?" అన్నాడు. సీరియస్ గా.

"ఎందుకు జరగకూడదు? జరగరాదనే శాసనం మీ చేతుల్లో లేదుగా?"

"జరగకూడదని కాదుకాని, నువ్విలాకోరటం భావ్యంగా లేదు... నేను అనుకున్నాను; అవసానదశలో హాయిగా నీఒడిలో తలపెట్టుకొని, మృత్యువును ఆహ్వానించే ధైర్యాన్ని సంపాయించగలుగుతానని; అందుకనే నేనిక్కడికివొచ్చాను, నాకు మిగిలిందల్లా ఒక్క ఆత్మబంధువు—నువ్వే!"

ఈ చివరిమాటతో నేను పరవశనై పొయ్యాను. కాని ఇన్నాళ్ళుగా రవి నాకు కల్పించిన ఘోరసమస్యతో వేగి పోవటాన్ని ఒక్కసారిగా ఎలా మరిచిపొయ్యేదీ?

వ్యంగ్యంగా అన్నాను. "పూస్తూ పూస్తూ నాలుకమీద తేనెకూడా పూసుకొచ్చావా—నాకోసం?"

"రాణీ! నన్ను అర్థంచేసుకోలేక పొయ్యావ్!"

"నేనా?" అని నవ్వి అన్నాను; "ఏనాడు నాప్రేమను తృణీకరించి, నాదృష్టినుంచి తప్పుకు తిరగటం మొదలు పెట్టారో, ఆనాడే మిమ్ము పూర్తిగా అర్థంచేసుకున్నాను. నేను అపార్థం చేసుకున్నాననే అనుమానం నాకెప్పుడూ కలగలేదు. ఎందుకంటే, మీ ప్రవర్తనలో మార్పేమీలేదు కనుక!...ఇక యీనాడు నన్ను మీ ఆత్మబంధువు అన్నారు. ఇది కలనైనా అయితే బాగుండిపొయ్యేది; మీ మాట బాగా అతికేది. నేను మీకు ఎవర్ని? కనీసం వివాహమన్నా చేసుకున్నట్టయితే, కృతజ్ఞతాపూర్వకంగానన్నా ఆమె మీకు సేవచేసేది. అప్పుడు మీకు నాచింత బాధించేది కాదు, అలాంటి దేమీ జరగలేదు. ఆసేవచేసే భాగ్యానిక్కూడ నేను నోచుకోలేదు—"

మాట మధ్యలోనే అందుకొని "చేసుకున్న భార్యకన్న విలువైన వ్యక్తులు లోకంలో ఉండరని నీనమ్మకమా రాణీ? చేసుకున్న భార్యఅంటే యేమిటో నీకు తెలుసు—కాని, నాకు తెలియకపోవాచ్చు." నవ్వాడు.

రెండు మూడు నిమిషాలసేపు ఇద్దరమూ మౌనంగానే ఉండిపోయ్యాం

రాణీ—నన్ను అడిగావ్ 'నేను ఎవర్ని?' అని, దీనికి జవాబు తెలుసుకునేందుకు ఇదే నిజమైన సమయం!''

''ఆ సమయాలన్నీ మించిపోయినయ్ అనేకసందర్భాల్లో మీరాసంగతి నానసాళానికి అంటేట్టు తెలియజేశారు. ఇక యీనాడు నాకొక కొత్తస్థానాన్ని ఇవ్వటానికి ప్రయత్నించటం నిజంగా హాస్యాస్పదం!''

''రాణీ! నామాటలన్నీ పూర్తికాలేదు. నీలో ఓర్పు చాలా తక్కువ. ఓర్పుతో ఆలోచించకపోతే, విషయాల లోతులు తెలియవు—''

''సరే...రాత్రికి తీరిగ్గా చెప్పవొచ్చు...ఏవో మాటల్లో అతిథిని సత్కరించటంకూడా మరిచిపోయ్యాను...'' అని వెళ్ళిపోయ్యాను.

రవి చెప్పబోయ్యేదేమిటో నేను తేలిగ్గా ఊహించాను. ఎన్నాళ్ళనుంచో నాకోసం దాచిన ప్రేమసంభాషణలను ప్రవాహంగా మాట్లాడుతాడు. కాని అవి నన్ను సంతోష పెట్టే సమయం దాటిపోయింది; ఇంతకాలానికి తెలుసుకొని విచారపడతానేమో కూడాను!

—కాని నన్ను మనసారా ప్రేమతో జీవితమంతా బాధించిన వ్యక్తి ఉన్నాడని తెలుసుకోవటం గర్వించదగ్గది. ఇన్నాళ్ళుగా అతనా ప్రేమను భద్రంగా దాచిపెట్టాడు.

నదిలోని నీటిలాగు అది ఒక్కసారిగా కట్టలు తెంచుకునే సమయం ఇదేనని తోచింది. ఇంత ఆలస్యంగా దీన్ని నేను గ్రహించినా, అతను ఆ ప్రేమను వెలిబుచ్చేందుకు తలక్కిందు లవటం నిజం; ఎందుకంటే ఉద్రేకాన్ని కొన్ని సంవత్సరాలుగ దాచుకున్నాడు; అగ్నిపర్వతంలాగు అది పగిలి వెలికి ఉరకవలసిన సమయం; అదెలా వుంటుందో చూడాలనే కుతూహలం నన్ను వేధించసాగింది.

రాత్రి భోజనసమయంలో, "ఇంత తృప్తిగా భోంచేసిన రోజే జీవితంలోలేదు" అన్నాడు రవి.

"ఇకముందు ఆతృప్తితో మీకు మొహం మొత్తుతుందేమో ? ఐనా ఇదేమీ రాజభోజనం కాదే !"

"భోజనంలో యేమీ లేకపోవొచ్చు. కాని వడ్డించే ఆ సుకుమార కరాల అనురాగపూరిత సత్కారం !"

ఆ కవిత్వానికి నవ్వి ఊరుకున్నాను.

భోజనాలయిపోయినయ్. ఇద్దరమూ తీరిగ్గా కూర్చున్నాం. అతను తదేకదృష్టితో నాముఖంలోకి చూడసాగాడు. దీపపు వెలుగు మీదపడకుండా చోటుమారుదామనిపించింది... కాని అతనలా చూడటంవల్ల నిజానికి నాకు ఆనందంగానే వుంది.

"రాణీ ! ఇలాంటి రోజుకోసం ఎన్నాళ్ళనుంచో కలలు కంటున్నాను !"

"నిజంగా ఏనాడో వాస్తవిక జీవితంలో సంభవించే సంఘటనను చేతులారా వొదులుకొని, కలలుకనే జీవితాన్ని ఎన్నుకున్నాడు - అది మీతప్పే !"

"—కాని ఆ వాస్తవికాన్ని భరించటం అంత సులభమైనది మాత్రం కాదు. ఒకనాడు ఏ మాటలన్నయితే నేను అనేందుకు భయపడి ఊరుకున్నానో, వాటన్నిటినీ ఇప్పుడు మాట్లాడగలను. వాటిఅర్థాన్ని నువ్వు సంపూర్ణంగాగ్రహించగలవు—"

"మీరు భయపడ్డారా ? ఆమాటకు నాకు నవ్వొస్తోంది. పైన ఇదొక గొప్పసమయమనికూడా చెప్తారు !"

"ఔను. అందులో సందేహించాల్సిందేమీ లేదు. జీవితంలోని అతి ప్రమాదకరమైన వయస్సులోనుంచీ, అది సృష్టించ గలిగే అవకాశాల కత్తెరబోనుల్లోంచీ బైటపడి ముందుకు సాగివొచ్చాం. ఇక వెనక్కుపోయ్యే మార్గమేమీ లేదు. అభిరుచులు కానీ, ప్రేమ కానీ వాంఛలు కానీ తీవ్రరూపం దాల్చి-మన మానవత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ సాధ్యమైనంత కిందికి దిగలాగే సమయాలు దాటిపోయినయ్. అందుకని, ఇప్పుడు హృదయాల్ని విప్పిచెప్పుకునేందుకూ, ఆత్మార్పణలు చేసుకునేందుకూ ఇక అడ్డు ఉండదు?"

"నాకు అర్థంకావటంలేదు" అన్నాను.

"విను: ఇద్దరమూ యవ్వనంలో ఉన్నప్పుడు ఏకాన్త అవకాశాన్ని ఉపయోగించుకున్నా, ఒకరి నొకరు తనివి తీరా అనుభవించేవాళ్ళం"

"ఔను. అందులో విశేషం ఏముంది? అందుకు విచార పడాల్సిందిమాత్రం ఏముందీ?" అన్నాను.

"పైకి కనిపించనిది చాలావుంది. ప్రేమ అనే పదాన్ని అడ్డంపెట్టుకొని, నరాల తిరుగుబాటుకు లొంగిపోయి ఉండే వాళ్ళం. అప్పుడు ఇతరులప్రేమకూ, మనప్రేమకూ భేద మేమీ ఉండేదికాదు. మనదికూడా సాదాప్రేమగా మారి కూర్చునేది!"

"ఒకరికన్న విశేషం ఉండాలని కోరేందుకు మనకేం అధికారంవుందీ? ఇతరుల్లాగే మనంకూడా ముక్కుతోనే గాలి పీలుస్తున్నాం. వాళ్ళలాగే కాళ్ళతో నడుస్తున్నాం. ఇదే భూమిమీద యీసూర్యరశ్మినే, యీవెన్నెలనే, యీ గాలినే, యీనీటినే అనుభవిస్తున్నాం. అందుకని ఇతర ప్రేమలకన్న, మనప్రేమ ఎందుకని పైమెట్టున ఉండాలి?"

"నీ వాదంలో కొంతవరకే సత్యం వుంది...ఇతరుల ప్రేమ కొంతకాలంవరకే ఉంటుంది; కనీసం రోజులు గడిచిన కొద్దీ క్షీణించితీరుతుంది"

"జీవితానికే పరిమితి ఏర్పడి వున్నప్పుడు—"

"కనీసం ఆ పరిమిత జీవితాంతం వరకన్నా లేనిప్రేమ—అదీ వొకప్రేమేనా?"

"అంటే మీరు నన్ను యీ జీవితమంతా ప్రేమించా నంటారు—అంతేనా?" అన్నాను, అపనమ్మకపు నవ్వుతో.

"అందుకు ఇంకా అనుమానమా? హృదయపు లోతు

ల్లోంచి యీమాటలు వొస్తున్నయ్యని ఎలా రుజూ చేసేది ?''

''ఐతేమీరా ప్రేమను ఇన్నాళ్ళూ ఎందుకు దాచిపెట్టారు? సిగ్గుపడా ? భయపడా ?''

''అదేమీకాదు... ఆ సంగతి బైటపెట్టినట్టయితే—చెడుగే సంభవించివుండేది. ఆ వయస్సులో నువ్వది గ్రహించినట్టయితే—నన్నింకవొది లేదానివి కాదు. నువ్వుకోరిన వ్యక్తి నిన్ను ప్రేమిస్తున్నాడనే ఆలోచనతో, తృప్తితో—బంధుమిత్రుల్ని, లోకాన్ని కాలతన్నే దానివి. నాచేతకూడా ఆపని చేయించేదానివి. అప్పుడు సంఘ కట్టుబాట్లకు భయపడి, మనిద్దరమూ లేచిపోవాల్సిన పరిస్థితి ఏర్పడేది. మామూలు కథలోలాగే మనజీవితం నేలపాలయ్యేది. చివరకు పశ్చాత్తాపం వొచ్చేటప్పటికి సమయమంతా మించిపొయ్యేది''

నేను వ్యంగ్యంగా నవ్వి అన్నాను. ''ఔను... అప్పుడు నిజంగానే నన్ను అసహ్యించుకొనేవాళ్ళు. నేను లొంగిన ఆడదాన్నయె—మీరు అన్నిహక్కులూవున్న మొగవాళ్ళయె-నన్ను భరించటం మీశక్తికి మించిన పనయ్యేది—తన్ని బైటికి పంపేవాళ్ళు !''

''నా ఒక్కడిసంగతే నువ్వు ఆలోచించావ్ — రాణీ! ఇంకా దూరం ఆలోచించు: నీ సంతానం సంగతేమిటి ? ఆ ప్రేమమైకంలో నిన్నూ, నీ సంతానాన్నికూడా మలినం

చేసేవాణ్ని. అప్పుడు ఆ సంతానం మనిద్దరి జీవాలకూ పడి ఏడ్చేవాళ్ళు!''

''లోకానికి భయపడ్డారన్నమాట?''

''భయమే కావొచ్చు. మార్పురాని ప్రపంచం— మనం పొందే మార్పుని భరించలేదు. నేను పురుషుణ్ని కావటం వల్ల యీ సమాజమూ, ప్రభుత్వమూ నాకు ఇచ్చిన స్వేచ్ఛ నన్ను అన్నివైపులనుంచీ రక్షించేది...మరి నీసంగతో?''

నాగతి నిజంగానే ఏమయ్యేదో ఇప్పుడు ఊహించుకో గలిగాను. ఇంకో కొత్త అనుమానం నన్ను వెంటాడసాగింది.

''పోనీ అప్పుడే యీ కారణాలన్నీ చెప్పెయ్యలేక పోయ్యారా? అంతా పాతర వేసి, ఇన్నాళ్ళయ్యాక—''

''చెప్తే ఊరుకునేదానివా? వాటికిచిట్కాలు ఆలోచించి, నామాట సాగనిచ్చేదానివి కాదు. ఇప్పుడంటావా యవ్వనోద్రేకానికి కట్టుబడే ప్రమాదస్థితిని దాటేశాం. ఉద్రేకంతో కాకుండా, జాగ్రత్తగా విషయాల లోతులన్నీ అర్థం చేసుకో గలం. ఇప్పుడు ఆత్మనిగ్రహం లేకపోయినా, శారీరక పరిస్థితి ఏర్పరిచిన నిగ్రహమున్నా మనను రక్షిస్తుంది. ఇద్దరమూ ఒకే పక్కమీద పడుకున్నా, నువ్వు నిర్భయంగా మూడేళ్ళ బిడ్డను లాలించినట్టు—నన్ను లాలించగలవు!''

నాకు మరికొంత అర్థమైంది...

''మీకు కోపం రాదనుకుంటాను...కనీసం మీకు కలిగే

నరాల తిరుగుబాటుకన్నా—ఒక స్త్రీ అవసరం కలగలేదా? నాసంగతి కాదు—''

నవ్వాను—నా అమాయకత్వానికి కాబోలు.

''నువ్వు అడిగిన ప్రశ్నలోనే దీనికి జవాబువుంది...అంత కన్న లోతుగా ఆలోచించేందుకు ఎందుకు ప్రయత్నించవు? సామాన్యమానవుడికి నిగ్రహశక్తి ఉండటం చాలా కష్టం. అందులోనూ ఉద్రేకాన్ని రేకెత్తించే అనేక సంఘటనల మధ్య బతుకుతూ! కాని ఆ నిగ్రహశక్తిని కనీసం ఒక్క వ్యక్తిదగ్గరన్నా ఎందుకుచూపలేననేప ట్టుదలతోనేఇన్నాళ్లూ గడపగలిగాను. నా శారీరకవాంఛలు తీరేందుకు నీలాటి దేవతను ఉపయోగించ దలచలేదు. ఒకవేళ అలా జరిగి నట్టయితే, నాదృష్టిలో నువ్వుకూడా — ఒక మామూలు ఆడదానికిందనే ఉండిపొయ్యేదానివి! అప్పుడు నీకు ప్రేమ అనే పదాన్ని అన్వయించలేకపొయ్యేవాణ్ని!''

నాలోని ఈర్ష్య తలెత్తింది.

అన్నాను: ''ఇతర అందగత్తెలెంతోమంది ఉండగా నేనెందుకు అనుకున్నారు...అందేనా?''

''వాదనను అలా పెడమార్గాలకు లాగేందుకు ఎందుకు ప్రయత్నిస్తావ్? నీకన్న అందగత్తెల్తోనే లోకం నడుస్తూండ వొచ్చు. కాని వాళ్ళందర్నీ ప్రేమించేశక్తి నాకులేదు. ఒక వేళ నేను ప్రేమించగలిగినా, వాళ్ళందరూ తిరిగి నన్ను ప్రేమిస్తారనే నమ్మకం ఏదీ? ప్రేమించి, శారీరకంగా అనుభ

వించటం ప్రతిమానవుడూ చెయ్యగలిగేపని... కాని ప్రేమించి పూజిస్తూ, దాన్ని జీవితాంతంవరకూ నిలుపుకోగలగటం చాలా కష్టమైనపని! మొదట్లో ఇందులో విజయాన్ని సాధించగలననే నమ్మకం ఉండేదికాదు......ఇప్పటికి ఆ నమ్మకం పూర్తిగా కలిగింది...మనిద్దరిమధ్యా ప్రేమ, 'ప్రేమ'గానే ఉండిపోయింది. అది రంగుమార్చుకొని ఇంకో విధంగా మారలేదు...ఒక్కసారి మనం కాళ్ళుజారినట్టయితే, యీ ఉన్నతాదర్శానికి చాలా దూరమయ్యేవాళ్ళం... నువ్వు ఆనాటిరాత్రి నాగదికి వొచ్చావ్...గుర్తుందా? అబ్బ! ఆనాడు నాశక్తులన్నింటినీ కష్టేసేందుకు శక్తి చాల దేమో ననిపించింది...కాని ఎలాగో నిగ్రహించుకోగలిగాను—రాణీ!"

ఆ సంఘటన నేనింకా మరిచిపోలేదు. ఆనాటి ఆశతోనే ఇంకా బతకగలిగానని నా నమ్మకం.

"దానికి నేను సంతోషించాననీ, ఆ సంఘటనను ఆనందించగలిగాననీ మీరు అపోహపడుతున్నట్టున్నారు—?" అన్నాను.

"లేదు...అది నాకు ఎంతబాధను కలిగించిందో, నీకు అంతకన్న ఎక్కువబాధనూ, విచారాన్నీ, అసంతృప్తినీ కలిగించివుంటుందని నాకు తెలుసు. విషయం తెలిసి నేను తప్పుకోవాలి; నిన్ను అమాకత్వంలోనే తప్పించాలి. పిల్లవాణ్ణి మరిపించినట్టు నిన్ను మరిపించేబాధ్యతా, పెద్ద

వాణ్నిగా కాలుజారకుండా నన్ను నేను కాపాడుకునే బాధ్యతా నాకువుంది. అందుకనే, నీనుంచి తప్పించుకు తిరిగేందుకు ఎంతగానో ప్రయత్నించేవాణ్ని..."

"ప్రేమకు లొంగకూడదనుకున్నారు—కాని ఇప్పటికైనా లొంగిపోయ్యారుకదా?" అన్నాను.

"లొంగకూడదనికాదు; దానికే కాకుండా అది తెచ్చే ఉద్రేకానికి బానిసలై పోకుండా చూసుకోవాలి. మనం శారీరకసుఖాన్ని అనుభవించలేము. ప్రేమించుకున్న దాని ఫలితం—చివరి మెట్టు—స్త్రీపురుషులు ఒకర్నొకరు అనుభవించటమే! ఆ క్షణికసుఖంకోసం ప్రేమించటం ఒక దండగే! నువ్వు కోరినవ్యక్తిని అష్టకష్టాలూ పడి అనుభవిస్తున్నాననే తృప్తికన్న ఎక్కువేమీ లేదు. బంగారు ఆభరణాల్ని ధరించిన ఆడది—ఆ బంగారం లోకంలో చాలామందికి లభ్యంకానిదని—ఏరకంగా తృప్తిపడుతుందో—అలాటిది! ఇక ఆ చివరిమెట్టు దాటామో—ఆపైన యేమీలేదు. ప్రేమ పెట్టిన మభ్యత ఐపోతుంది. ఇక కిందికి దిగిరావాల్సిందే!"

"లోకంలో ఇలా మభ్యపెట్టే వస్తుసామాగ్రే లేకపోతే—జీవితం మరీ చప్పబడదా?"

"అది మనవ్యూహాతో భేదించాల్సిన వ్యూహం. ఎంత కొత్తవస్తువైనా, ఎంత మనసుపడ్డ ఆహారమైనా—మనకు లభ్యమైనాదు—దాన్ని మితిమీరి అనుభవించే శక్తిలేని మానవుడు—దాన్నుంచి వెనక్కురాక తప్పదు. అనుభవం

కన్న, దానితాలూకు ఊహాఇచ్చే ఆనందమే నిజమైందేమో?
మన ప్రేమలో—ఎంతకాలం గడిచినా దాని కొత్తదనం
చెడదు. తెలిసిందా ?''

ఆలోచనలో పడ్డాను.

# 7

''చాలా సేపటిదాకా ఏం అడిగి తెలుసుకోవాలో నాకు
తోచలేదు. అతను మాట్లాడే అత్యున్నత శిఖరాలమీంచి
చూస్తుంటే, కళ్ళు తిరుగు తూన్నట్టనిపించింది. క్రమంగా
కొత్త అనుమానాలు నన్ను బాధించ సాగినయ్.

అన్నాను: ''మన స్నేహాన్ని భద్రంగా దాచేందుకు
యీ ఎత్తు వేశారన్నమాట ?''

''ఔను, మూసిన గుప్పెట్లోని రహస్యం లాటిది మన
స్నేహం. ఇలా ఎన్నాళ్ళయినా దాని కొత్తదనాన్ని కాపాడు
కోవొచ్చు. సెక్స్ అనుభవం కలిగిందంటే మాత్రం మరి
భరించలేం. ఎందుకంటే, సంయోగం జరిగాక, వియోగానికి
ఎదురు చూసి తీరవలసిన అవసరం ఏర్పడు తుంది కనుక;
వియోగం లేని సంయోగంలోని రుచి తెలియదు కనుక !''

''అట్లా అయితే, అసలు కాల్పనిక ప్రియురాలినే సృష్టిం
చుకుంటే సరిపొయ్యేది కదా ?''

''అంత అవసరం లేదు. అదీకాక, నేను నిర్మించుకున్న
యీ కట్టడానికి పునాదినువ్వు, దానికి మోసం వొస్తే

పైనున్న దంతా నేలపాలే! పూర్తి మోహాన్ని భరించలేని మనస్సుకు—ఇదొక ఎర. ఏమీలేని శూన్యంలోనుంచి శూన్యంతప్ప ఇంకేమీ రాదు కదా!''

''నన్ను ఊరిస్తూ, ఆశపెడుతూ ఇంతదూరం లాక్కొచ్చారా?''

''ఆ రహస్యాన్ని వెల్లడి చేసినట్లయితే, మనం అనుభవించిన ఆనందమే లభ్యమయ్యేది కాదు. రుచి చూసిన ఇతర ఆనందాలకన్న ఇదేమంత గొప్పదికాదనే విషయాన్ని తెలుసుకునేందుకు ఎక్కువ కాలం పట్టేది కాదు. మన స్నేహం వెనుక అడుగు వేసేందుకు అదే మొదలు! ఆవిధంగా ఎంత కిందికి దిగిపొయ్యేదో, దాంతోపాటు మనం ఎంత అధోగతి పాలయ్యే వాళ్ళమో— దానికి మన ఊహ అందదు రాణీ!''

''—కాని చివరకు 'అనుభవించ లేకపోయ్యాం' అనే నిరాశ మిగిలి పోయింది...దాని బాధ సామాన్యమా?''

''ఆ నిరాశను మనం కల్పించుకుంటున్నాం. నీకు తెలుసు: ఆ ఆశను నీలో చంపుకో లేవని. అది ఎప్పటికీ చావదు. అదే లేకపోయినట్టయితే, ఒకర్నొకరు జ్ఞాపకం ఉంచుకోవాల్సిన అవసరం కూడా ఉండేది కాదు!''

''ఇప్పుడు మీరంతా విప్పి చెప్పాకయినా, ఆ నిరాశను ఎదుర్కొనేందుకు సిద్ధపడాలి కదా! ఇన్నాళ్ళ లాగే దీన్ని జీవిత రహస్యంగా ఉంచినా సరిపొయ్యేది—''

''అదీ చూశాను. కాని నువ్వు గ్రహించే సూచనలేమీ కనిపించలేదు. నేను ఎవరి కోసం జీవితాన్ని త్యాగం చేశానో, నా అచంచల ప్రేమను ఇన్నాళ్లూ పొందగల అర్హత ఏ దేవతకు వుందో - ఆమెకే ఆ సంగతి తెలియక పోవటం చాలా అన్యాయమనిపించింది. నన్ను అపార్థం చేసుకున్నావ్; నేను ఎదురు చూసిన ఫలితాలే కనిపించ లేదు...ఇలాగే నేను ఏనాడో చనిపోతాను...అది వొక నిర్భేద్యమైన రహస్యంగానే ఉండిపొయ్యేది. నా మీది శత్రుత్వం వొక్కటే నీ హృదయంలో శాశ్వతంగా మిగిలి పొయ్యేది!''

''—కాని ఇది తెలుసుకోవటం మరీ బాధాకరంగా వుంది'' అన్నాను.

ఇకముందు ఇలా ఆలోచించేందుకు ప్రయత్నించు; ఒక వ్యక్తి నన్ను జీవితాంతం వరకూ ప్రేమించి పూజించాడనీ, నన్ను ఎన్నడూ అనుభవించేందుక్కూడా ప్రయత్నించ లేదనీ, అలా అనుభవించినట్టయితే—నాస్వాప్నిక సౌఖ్యం ఉండేది కాదనీ...ఆ ఊహే నీకు ఆనందాన్ని ఇవ్వగలదు!''

''అసలు ఆ అనుభవమే నాకు తెలియదు కదా?''

''అది తెలుస్తేఊహ అనవసరం. అసలు రహస్యమంతా అక్కడే వుంది...ఒక్కటి ఆలోచించు; నిన్ను నేనెన్నడూ మానవ మాత్రురాలుగా చూడలేదు. నీ భర్తలాగు అర్థం చేసుకునేందుకు ప్రయత్నించ లేదు. నీ వల్లపొందే శారీరక

సుఖం యేమిటో నీ భర్తకు తెలుసు కనుక. అతను నిన్ను మించిన 'రాణి'ని చూడలేను. కాని, నేను నిన్ను 'రాణి' గా కాకుండా, నా ఊహకునచ్చిన విధంగా, ఇంతకన్న ఉన్నత మైన దృష్టితో చూసి ఆనందించాను. ఆ ఊహకు చలనం కలగలేదు; ఎందుకంటే—నిజమైన అనుభవాన్ని నేను ఎరుగనుకనుక...ఆవిధంగా దూరదూరంగా ఉండికూడా మన స్నేహాన్ని వృద్ధిచేసుకో గలిగాం!''

నా తల దిమ్మెక్కి పోయినట్టయింది. రవి తెలివి తేటలు నాకులేవు; అందుకని అత్యున్నత వేదాంతాన్ని నేను అనుభవించ లేని మానవమాత్రురాలిగానే ఉండిపోయి వుంటాను.

అన్నాను: ''జీవితమంతా ధారవోసి, ఇంత కష్టసాధ్య మైనదాన్ని సాధించారు. కాని ఇంతకన్న తక్కువ శ్రమతో ఎక్కువ సౌఖ్యాన్ని అనుభవించేందుకు ప్రయత్నించ లేదు. మీరలా ప్రయత్నించి నట్టయితే—మన వివాహం జరిగి నట్టయితే-ఇద్దరి జీవితాల్నీ స్వర్గసౌఖ్యంలోకి లాగేవాళ్ళు... కాని మీ గొప్ప ఆదర్శాలతో నరకకూపంలోకి లాగారు!''

నవ్వి అన్నాడు: ''అంతా వినికూడా అర్థం చేసుకోవేం రాణీ! మన వివాహమే జరిగినట్టయితే—మన ప్రేమను మన సంతానం పంచుకునేది. క్రమంగా ఆ ప్రేమక్షీణిం చేది. ఈ రకం ప్రేమ ఎవరికీ హానిలేనిది. అచంచలమైంది కూడానని తేల్చుకున్నాను—''

"మీ ఆదర్శానికి రెండు నిండుజీవితాలు బలిఅయినయ్"

"నిజమే! కాని అనేకమంది శాస్త్రకారులు, కొన్ని కోట్ల ప్రాణుల బలిగా, మరికొన్ని ప్రాణుల సౌఖ్యం కోసం (?) కొన్ని ఎక్స్‌పరిమెంట్స్ చేస్తున్నారు. నేను మాత్రం నా జీవితంతోపాటు ఇంకొక్కరి జీవితాన్నే పాడుచేశానేమో? అందుకు నేనెన్నడూ విచార పడలేదు; ఎందుకంటే అదినాకు చెక్కు చెదరని ఆనందాన్ని జీవితమంతా ఇవ్వగలిగింది!"

"మీరు హృదయంతో నన్ను ప్రేమించారు...కాని శరీరసౌఖ్యానికి ఇతరస్త్రీలను వెంటాడారు. హృదయానికీ శరీరానికీ ఎంతదూరమో నాకు బాగా తెలియదు...ఎందుకంటే, హృదయంఅనేది శరీరంలోనే వుంది. చొక్కావిప్పి వొంకెను తగిలించినట్టు హృదయాన్ని తీసివేసి, వొట్టి శరీరాన్ని ఉపయోగించ గలగటం—గారడీ ఐ వుండాలి!"

నవ్వాడు—నా తెలివితేటలకు కాబోలు.

"హృదయాన్ని శరీరంనుంచి విడదియ్యగలిగే శక్తి మానవులకు లేనిమాట నిజమే కాని—హృదయపూర్వకంగా మనం చెయ్యగలిగిన పనులు యీలోకంలో బహుకొద్ది. మనకు ఇష్టమైన సంఘటనల సంఖ్యను వేళ్ళమీద లెక్క పెట్టవొచ్చు. ఇక అవసరంకోసం కేవలం శరీర నిర్మాణమూ, ప్రకృతీశాసించే ఆ పశుత్వంకోసం హృదయం ఉన్నదనే మాటను కూడా మరిచిపోయి, ఎన్నో పనులుచేసి తీరాల్సిన

వసరం యేర్పడుతుంది. దాన్ని నిర్వర్తించినంతమాత్రాన, హృదయపూర్వకంగా చేస్తున్నామనేందుకు వీల్లేదు.''

నా ఆరాటమంతా చల్లారింది. మాట్లాడేందుకు మరి ాటలే కరువైనట్టు తోచింది. రవినిచూసి ఇక ఉద్రేకం గే అవకాశంలేదు. అతని ఆదర్శాన్ని అర్థంచేసుకునేందుకు తో ప్రయత్నిస్తున్నాను. స్త్రీని అస్వతంత్రను— నేను ాసార్లు కాలుజారి, తూలి అతని ఎదుట పడ్డానుకాని; పట్టుకోబోయి అతనుకూడా కాలుజారుతే బాగుండే అప్పుడు అనిపించించింది. కాని అతను పట్టుదలతో వట్టి కానికి సామాన్యమానవుడిలాగు లొంగకుండా, నిలవ కొని, నన్నుకూడా అధఃపాతాళంనుంచి లేవనెత్తాడు.

యీ అత్యున్నతప్రదేశంమీదినుంచి చూస్తే దే అచంచల సౌందర్యమూ, చెడని కొత్తదనమూ ంచ గలుగుతున్నాను ... నా దురూహ లన్నీ పోయినయ్. రవి నన్ను మనసారా ప్రేమించి, తా పూజించాడనే ఊహ నాకొక్కొత్త ఉత్సాహాన్నీ, న్ని ప్రసాదించింది. ఏనిరాశవైపైతే ఇన్నాళ్ళూ డ్డానో, అదంతా ఆశగా మారిపోయింది! ఇంతకన్న నన్ను సంతోషపెట్టగల మాటలేముంటయ్! సారిగా సంభవించిన యీ మార్పును నేనే నమ్మ నినిపించింది.

"ఇంత గొప్పసిద్ధాంతం మింగుడు పడటంలేదు...
"మెల్లిగా అలవాటుచేసుకోవాలి!" అన్నాడు.

అంతకన్న గత్యంతరంలేదు. అతన్ని చూసినప్పుడల్లా - హృదయంలోని ఆనందమంతా భరించలేనంతిగా పొంగి పొరిలేది. అతని మాటల్లోని సత్యాన్ని తలుచుకుంటే— నాలోని ప్రతిర క్తకణమూ భయంతో ఒణికేది. ఈజ్ఞాని ముందు నిలబడేందుకూ, అతని కళ్ళల్లోని జ్ఞానకిరణాల కాంతిని చూసేందుకూ ధైర్యం చాలటంలేదు! అతని మీదయేర్పడ్డ గౌరవానికి మరి చలనంలేదు. భక్తురాలికి భగవంతుడే సాక్షాత్కరించినప్పటి ఆనందం లాటిది నన్ను తన్మయుంచేసింది. పాదాలంటి నమస్కరించకుండా ఉండ లేకపొయ్యాను.

అతని వ్యాధి క్రమంగా పెరగటమేకాని, తరగటంలేదు. రాత్రిళ్ళు నిద్రకుదూరమై, దగ్గుతో బాధ పడేవాడు. కనీసం కొన్నాళ్ళకన్నా యీ ఆరాధ్యదైవానికి సేవచేసే అవకాశం దొరికిందనే తృప్తిఒక్కటే నాకు మిగిలింది.

సాయింత్రం ఇద్దరమూ పొలాలవైపుకు షికారువెళ్ళే వాళ్ళం. అతని దేహస్థితి ఎంత అనుమానాస్పదంగా తోచినా, అతని ప్రవర్తనా, చేతలూ మాత్రం ఎన్నో ఆరోగ్యలక్షణాల్ని సూచిస్తూనేఉన్నయ్.

"మంచిమందులు వాడుతూ, మంచి చికిత్స ఎందుకు తీసుకోకూడదూ?" అన్నాను, ఒకనాడు.

అవసరం యేర్పడుతుంది. దాన్ని నిర్వర్తించినంతమాత్రాన, హృదయపూర్వకంగా చేస్తున్నామనేందుకు వీల్లేదు.''

నా ఆరాటమంతా చల్లారింది. మాట్లాడేందుకు మరి మాటలే కరువైనట్టు తోచింది. రవినిచూసి ఇక ఉద్రేకం కలిగే అవకాశంలేదు. అతని ఆదర్శాన్ని అర్థంచేసుకునేందుకు ఎంతో ప్రయత్నిస్తున్నాను. స్త్రీని అస్వతంత్రను— నేను చాలాసార్లు కాలుజారి, తూలి అతని ఎదుట పడ్డానుకాని; నన్ను పట్టుకోబోయి అతనుకూడా కాలుజారుతే బాగుండే దని అప్పుడు అనిపించించింది. కాని అతను పట్టుదలతో వట్టి ఉద్రేకానికి సామాన్యమానవుడిలాగు లొంగకుండా, నిలవ తొక్కుకొని, నన్నుకూడా అధఃపాతాళంనుంచి లేవనెత్తాడు. ఇప్పుడు యీ అత్యున్నతప్రదేశంమీదినుంచి చూస్తే కనిపించే అచంచల సౌందర్యమూ, చెడని కొత్తదనమూ అనుభవించ గలుగుతున్నాను ... నా దురూహ లన్నీ దూరమై పోయినయ్. రవి నన్ను మనసారా ప్రేమించి, జీవితమంతా పూజించాడనే ఊహ నాకొక్ కొత్త ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ ప్రసాదించింది. ఏనిరాశవైపైతే ఇన్నాళ్ళూ తరుమబడ్డానో, అదంతా ఆశగా మారిపోయింది! ఇంతకన్న జీవితంలో నన్ను సంతోషపెట్టగల మాటలేముంటయ్! కాని ఒక్కసారిగా సంభవించిన యీ మార్పును నేనే నమ్మ లేకపోయ్యా ననిపించింది.

"ఇంత గొప్పసిద్ధాంతం మింగుడు పడటంలేదు..."

"మెల్లిగా అలవాటుచేసుకోవాలి!" అన్నాడు.

అంతకన్న గత్యంతరంలేదు. అతన్ని చూసినప్పుడల్లా - హృదయంలోని ఆనందమంతా భరించలేనంతిగా పొంగి పొరిలేది. అతని మాటల్లోని సత్యాన్ని తలుచుకుంటే— నాలోని ప్రతిరక్తకణమూ భయంతో ఒణికేది. ఈజ్ఞాని ముందు నిలబడేందుకూ, అతని కళ్ళల్లోని జ్ఞానకిరణాల కాంతిని చూసేందుకూ ధైర్యం చాలటంలేదు! అతని మీదయేర్పడ్డ గౌరవానికి మరి చలనంలేదు. భక్తురాలికి భగవంతుడే సాక్షాత్కరించినప్పటి ఆనందం లాటిది నన్ను తన్మయంచేసింది. పాదాలంటి నమస్కరించకుండా ఉండ లేకపొయ్యాను.

అతని వ్యాధి క్రమంగా పెరగటమేకాని, తరగటంలేదు. రాత్రిళ్ళు నిద్రకుదూరమై, దగ్గుతో బాధ పడేవాడు. కనీసం కొన్నాళ్ళకన్నా యీ ఆరాధ్యదైవానికి సేవచేసే అవకాశం దొరికిందనే తృప్తిఒక్కటే నాకు మిగిలింది.

సాయింత్రం ఇద్దరమూ పొలాలవైపుకు షికారువెళ్ళే వాళ్ళం. అతని దేహస్థితి ఎంత అనుమానాస్పదంగా తోచినా, అతని ప్రవర్తనా, చేతలూ మాత్రం ఎన్నో ఆరోగ్యలక్షణాల్ని సూచిస్తూనేఉన్నయ్.

"మంచిమందులు వాడుతూ, మంచి చికిత్స ఎందుకు తీసుకోకూడదూ?" అన్నాను, ఒకనాడు.

"చికిత్స మరిలాభం లేదు...అన్నీ చూసేవ్వారుకున్నాను. నేను అనుకుంటూను: చాలారోజులక్రితమే. శారీరకంగా నేను మృతిపొందాను. కాని నాలోని ఆత్మవిశ్వాసమూ, ఊహలు కల్పించే స్వర్గసౌఖ్యమూ—నాలో ఒకరకం శక్తిని ప్రవేశ పెడుతున్నయ్. దాని బలంతోనే నేనింకా బతకగలుగు తున్నాను. కనీసం నా నిజస్థితి నాకు తెలియటంలేదను కుంటూను, మందులూ, చికిత్సా ఇవ్వేమీ ఆశక్తిని ఇవ్వ లేవు—కనుక అవ్వేమీవొద్దు"

ఇది నిజమేఐవుండవొచ్చు. పాలిపోయిన చెక్కిళ్ళూ, బల హీనంగా కదిలేఅవయవాలూ ఇందుకుసాక్షి. కాని విపరీత మైన తృప్తిని సూచించే అతనిముఖకళను చూస్తేనే— నిరాశాజీవికి ఆశపుట్టక మానదు!

లోకంలో ఒకరకం మనుష్యులున్నారు. వాళ్ళపని— తాము జీవించి ఆనందించటంకాదు. ఇతరుల ఆనందాన్ని హేళనచేస్తూ ఇతరులను నీచపరిచి, వాళ్ళు ఆనందించటం! ఇలా పనిగా పెట్టుకున్న వ్యక్తులసంగతి ఇన్నాళ్ళూ నాకు తెలియదు. ఇది పల్లెటూరుకావటంవల్లా, జనాభా చాలా కొద్ది కావటంవల్లా, యీకుత్సితస్వభావులు మరి దాగలేక పొయ్యారు. కొన్నాళ్ళవరకూ తమలో తాము గొణుక్కు న్నారు. మరికొన్నాళ్ళకు ఇతరులచెవినికూడా వేసి వాళ్ళ సహాయాన్ని కూడా కొనితెచ్చుకున్నారు. మరి కొన్నా ళ్ళయ్యాక, తాము చర్చించేవిషయాన్ని, మమ్మల్ని అవమా

నించేందుకు ప్రయత్నించేమాటల్నీ—రకరకాలుగా తమ ప్రావీణ్యతతో మాకు అందించేందుకు ప్రయత్నించారు.

మొదట వీళ్ళనుగూర్చిన ఆలోచనరాగానే నాలో నేను నవ్వుకున్నాను. కల్మషాత్మ లేకపోవటంవల్ల నా కేమీ భయం కలగలేదు. కాని, ఏ అసత్యాన్నయితే వాళ్ళు శ్రమపడి, పనిగా పెట్టుకొని ప్రచారంచేసేందుకు ప్రయత్నిస్తున్నారో, దానివేడి నన్ను బాధించసాగింది.

'రవి' ఎవరనే విషయాన్ని తర్కించి వీళ్ళందరకూ నచ్చ చెప్పాల్సినబాధ్యత కానీ — వీళ్ళముందు ఏ అగ్నిప్రవేశమో చేసి నా సతీత్వాన్ని రుజూచెయ్యాల్సిన బాధ్యత కానీ నాకువుందా? అతను ఎవరైనా కానీ, కనీసం ఒక మానవుడుగానన్నా అతన్ని భరించలేరా? ఇంతమంది అజ్ఞానుల మధ్య ఒకజ్ఞానికి స్థానమే లేకపోవటంలో ఆశ్చర్యమేమీ లేదు. వీళ్ళందరూ కలిసినా రవి కాలిగోటికి సరిరారని నా అంతరాత్మ ఘోషిస్తూనే వుంది కాని, ఆ నిజాన్ని వీళ్ళచేత ఒప్పించేందుకు మాత్రం బ్రహ్మ దిగిరావాలి!

"మనం పట్టణవాసానికి మారుతే...?" అన్నాను రవితో-అంతకన్న మంచిమార్గం నాకు తోచలేదు.

"అంత బెదరిపోవాల్సిందేమీ ఉన్నట్టు నాకు తోచదు. ఈరకం మనుష్యులు లోకమంతటా వున్నారు. ఒకే కప్పు కింద నివశించే స్త్రీ పురుషుల స్నేహానికి యీ దేశంలో

ఇంతకన్న గౌరవప్రదమైన స్థానం లేదు. అది వాళ్ళ దౌర్భాగ్యం!''

రెండుమూడు నిమిషాలు నిశ్శబ్దతలోనే గడిచినయ్.

రవి అన్నాడు: ''ఇక్కడ నాగూర్చినబాధ నాకేమీ లేదు. నేను మొగవాణ్ని కావటంవల్ల—యీ సంఘం నా తప్పులన్నింటినీ (?) వెంటనే క్షమించగలదు...కాని స్త్రీవి కావటంవల్ల ఏ సందర్భంలోనూ నీకు క్షమలేదు. నువ్వా కళంకాన్ని భరించితీరాల్సిందే!...అందుకని నేను ఇక్కణ్నుంచి తప్పుకుంటే, నీశాంతిమయ జీవితానికి భంగం రాదు—''

విచారంతో నాగుండె నిండిపోయింది. రవిచేతులు పట్టుకొని అన్నాను: ''అది నాకు సంతోషాన్ని ఇస్తుందనుకుంటున్నారా? నాస్వామికోసం జీవితాన్నే ధారవోశాను. ఇక గౌరవం—జీవితంలోని ఒక భాగమేకనుక—దాన్ని లెక్కచెయ్యను. ఈ సంఘం ఇచ్చే గౌరవంతో నాకు ఆనందం కలగదు కనుక-అది నాకు అక్కర్లేదు. అదీకాక. మనలో ఏఒక్కరైనా ఇప్పుడు ఇంకోచోటికి వెళ్ళిపోతే—వాళ్ళ అనుమానం దృఢపడుతుంది. విజయసూచికంగా మనవెనుక నవ్వుతారు. వాళ్ళగురి ఎంత తప్పుతోవలోవుందో తెలుసుకోనిద్దాం. అందుకని మీరు ఎక్కడికీ వెళ్ళక్కర్లేదు. మీరిక్కడ ఉన్నందుకు యీ సంఘం నానుంచికోరే విలువను—అది ఎంతైనా ఫర్వాలేదు—నేను ఇచ్చితీరుతాను...''

రవి జాలిగా నాముఖంలోకి చూసి నవ్వి ఊరుకున్నాడు.

# 8

"అనుకున్నంతా ఐంది. తమసూటీపోటీమాటలు మాముందు నిష్ప్రయోజనమవటాన్ని—గ్రామస్థులు ఓటమిగా తీసికొని వుంటారు. చలించని మనస్థైర్యం ఉన్నవాళ్ళముందు అపవాదులు ఏం పనిచేయకలుగుతయ్ ? వారికి ఇంకొక్క మార్గం మాత్రం మిగిలింది. మాబదులు మా ఆత్మీయుల్ని బాధించి, వారిద్వారా మాకు ఒత్తిడిని కలిగించటం.

దానిఫలితంగా—ఒకనాటి అర్ధరాత్రి దాటాక, తలుపు కొట్టినధ్వని వినిపించింది; ఏదో ఒకరకం భయం నన్ను ఆవరించింది. ఇప్పటిదాకా దగ్గుతో బాధపడుతూన్న రవిని నిద్రాదేవి ఇంతకుముందే కరుణించింది. అతన్ని నిద్రలేపటం నాకు మించినపని ... లాంతరు తీసుకొని నేనేవెళ్ళి "ఎవరూ ?" అన్నాను.

"నేనే తలుపుతియ్ ?"

ఆ అధికారధ్వనిని వెంటనే గుర్తుపట్టలేక పొయ్యాను... అవతలివ్యక్తి యీ ఆలస్యాన్ని భరించలేక మళ్ళీ తలుపు బాదసాగాడు. ఈగోలతో రవికి నిద్రాభంగ మవుతుందేమోనని తలుపు తెరిచాను.

ఎదురుగా మధు నిలబడివున్నాడు. అతని ముఖంలో ద్వేషంతోకూడిన అసహ్యం స్పష్టంగా కనిపిస్తోంది. బాగా తాగినవాడి కళ్ళవలె వాడికళ్ళు ఎర్రగా ఉన్నయ్. ఏదో

విషయాన్ని తానొక్కడే తీవ్రంగా ఆలోచించి, గాయపడి దాన్ని మరి సహించలేని పరిస్థితిలో ఉన్నట్టు గ్రహించ గలిగాను.

"నువ్వా? ... ఎవరో అనుకున్నాను. వొస్తున్నట్టు ఉత్తరమన్నా రాయలేదేం?" అన్నాను.

వాడు నావైపు అతికఠినముగా చూస్తూ "ఔను... ఉత్తరం రాసినట్టయితే ముందుగానే జాగర్త పడేదానివి!" అన్నాడు.

"నాకేమీ అర్థం కావటంలేదు"

"అర్థం!" అని గర్జించాడు.

"అరవొద్దు ... మెల్లిగామాట్లాడు. ఆయన ఇంతకు ముందే పడుకున్నారు."

"అర్థం కాలేదంటివే? నేను వొచ్చింది — ఆయన్ను గూర్చి తెలుసుకునేందుకే!"

"ఆయన జ్ఞాని ... అంతకుమించి నేను చెప్పగలిగిందీ. నువ్వు విన్నదగ్గదీ ఇంకేమీ లేదనుకుంటాను"

"జ్ఞాని?" అని హేళనగా నవ్వి "నీ ప్రియుడని చెప్పు కునేందుకు భయపడుతున్నట్టుంది...సిగ్గు—"

"నువ్వు నీతల్లితో మాట్లాడుతున్నావనే మాట మరిచి పోవొద్దు...ప్రియమైన వ్యక్తులు లోకంలో బహుకొద్ది. ఆయన అలాటిప్రియుడని చెప్పేందుకు భయపడే అవసరం లేదు. అందుకు నేను గర్వపడుతున్నాను కూడా!"

గడిచిపోయింది !...ఔను, బాగా అలవాటైపోయినవిషయ మాయె ! లోకుల్ని కూడా లెక్క చెయ్యకుండా—''

''నీకేమన్నా అనుమానాలుంటే...ఇది సమయంకాదు. అలసిపోయినట్టున్నావు. భోజనం చేశావా ?''

''భోజనానికి ఇది సమయంకాదు—'' అన్నాడు, దృఢ మైన కంఠధ్వనితో.

వాణ్నిక కొడుగ్గా చూసేందుకు మనస్కరించటంలేదు. కాని తొందరపడి, ఏ బలహీనతకు లొంగిపోయినా, మా ఇద్దరిమధ్యా అంతేందనిదూరం ఏర్పడుతుందని గ్రహించి, శాంతత వహించాను.

అన్నాను: ''సరే...ఇది నిద్రపొయ్యే సమయం — కనుక నిద్రపో. మిగతా విషయాలు రేపు మాట్లాడుకో వొచ్చు''

''ఔను...నీకు యీ వొక్కరాత్రీ వృథా అవుతుందే మోనని దిగులాయె ! నీ స్వార్థాన్నే చూసుకున్నావ్ కాని, వంశ మర్యాద సంగతన్నా ఆలోచించలేదు. ఇప్పుడు నేను అడిగేది ఒక్కటే ప్రశ్న: వాడెవరూ ? ఇక్కడెందుకు ఉండాలి ? నీకూ వాడికీ సంబంధం ఏమిటీ ?''

''ఆయన్ను అగౌరవంగా మాట్లాడ వద్దు. తల్లిగా నా కేమన్నా గౌరవముంటే, అంతకన్న ఎన్నోరెట్లు గౌర వాన్ని వారికి చూపాలనేమాట గుర్తుంచుకో. ఒకవేళ

నా మీద నీకు గౌరవం లేకపోయినా, వాగని అగౌరవించే హక్కు నీకు లేదు. ఎందుకంటే ఒక పెద్దమనిషిని, ఇంకో పెద్దమనిషిగా పరిగణింపబడేవాడు, అగౌరవించటం హాస్యాస్పదం !''

''పెద్దమనిషి ! అని నవ్వాడు.

''అంతేకాదు. ఆయన నీకూ నాకూ దాత. ఆయన డబ్బుతోనే నువ్వు చదువుకుంటున్నావ్. నేనిక్కడ సుఖంగా వున్నది వారి చూపుల చలవ నల్లనే ! విశ్వాస విహీనంగా ప్రవర్తించి ఆయన్ను చిన్న చూపు చూడాల్సిన అవకాశం ఏమీ లేదు...ఆయనే లేకపోతే మనిద్దరమూ అడుక్కుతినే వాళ్ళం... తెలిసిందా ?''

''అడుక్కుతింటూన్నా ఇంత బాధపడేవాన్ని కాదు. ముష్టివాళ్ళకూడా ఆత్మగౌరవం ఉంటుంది. కాని నీకూ, నీ కొడుకు నైనందుకు నాకూ అదికూడా మిగలలేదు !''

''మెల్లిగా మాట్లాడు...నాకు ఆత్మగౌరవం లేదా ?''

''ఉన్నదా ? ఇతరుల డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకునే వాళ్ళకు ఆత్మగౌరవం వుంటుందా ?''

''విపరీతార్థాలు తియ్యవోక. ఉన్న విజ్ఞానంతో పరిస్థితిని తప్పు దారిలో తరచటంవల్ల బాధే కలుగుతుంది. నీ తల్లి ఎప్పుడూ శీలాన్ని అమ్ముకొని బతికే పరిస్థితికి రాలేదు——''

''నాకళ్ళ నీళ్ళు తుడిచేందుకు యీ అబద్ధం దేనికి ?''

''భగవంతుడి మీద ప్రమాణంచేసి చెప్పినా నమ్మవా?''

"నమ్మే అవకాశా లేమీ నాకు కనిపించటంలేదు. అందుకని నువ్వు ప్రమాణంచేసి శ్రమకూడా పడనక్కర్లేదు. ప్రతి సంఘటనా కళ్ళముందే కనిపిస్తుంటే, ఇక అడిగి తెలుసు కోవాల్సిన అవసరంకూడా లేదనిపిస్తోంది."

"చదువుకున్నవాడివి ... లోకంలో తెలుసుకో దగ్గదీ, నేర్చుకోవాల్సిందీ చాలావుంది. నేర్చుకున్న దానికేమూర్ఛ పడి, ఆమూర్ఛలో నీకు తోచిన విధంగా కలలు కనటం మూర్ఖ్యం! ఒక్కటి ఆలోచించు: లోకం మా స్నేహాన్ని వేరొక విధంగా అర్థంచేసుకొని ఉండొచ్చు. కాని నువ్వు కూడా అదే రంగు అద్దంలోంచి చూస్తూ వాళ్ళతోపాటే అపార్థం చేసుకున్నావంటే—"

మాట మధ్యలోనే కొట్టొచ్చినట్లు అందుకొనిఅన్నాడు : "నువ్వు యీలోకంలో ఉన్నన్నాళ్ళూ, ఇంకో లోకంనుంచి మాట్లాడినట్టు నీతిబోధ చెయ్యటం నిజంగా హాస్యాస్పదం!"

"పోనీ లోకుల మాటలకూ—నిన్ను కనిపెంచి పెద్దను చేసిన నీతల్లి మాటలకూ భేదమే లేదా?"

"నాకు ఒకరిమాటల్తో పనిలేదు. నేను తెలుసుకోవా ల్సింది వొక్కటే ప్రశ్న! అతను మనకు బంధువుకాదు; మన కుటుంబానికి సన్నిహితుడు కాదు...అతను ఇక్కడ దేనికి ఉండాలి?"

"స్నేహానికి కులమూ, వయస్సూ, సంస్కారమూ, బంధు త్వమూ వీటితో సంబంధం లేదు, మానవుడి, మానవ

స్నేహితులు కఠువైనప్పుడు జంతువులే స్నేహితులు కావొచ్చు. స్నేహాన్నిగూర్చి నీకిప్పుడు అర్థమై వుంటుంది''

''అతను జంతువా ?'' అని వికటంగా నవ్వాడు.

చేతులో ఆయుధమూ, శరీరంలో శక్తీ లేనందుకు విచారించాను... శారీరకబలం పనిచెయ్యనిచోట మిగిలే సక్రమ వాదన వొక్కటే నాకు శరణ్యమైంది.

అన్నాను: ''నేను జంతువును... నువ్వు ఏమిటో నేనిక చెప్పక్కర్లేదు''

ఒక నిమిషంసేపు వాడేమీ మాట్లాడలేక పోయ్యాడు. ఆలోచనతో క్రోధాన్ని రగుల్చుకుంటున్నా డనిపించింది.

''సరే... వాడిక్కడ ఎందుకు ఉండాలి ?''

''ఎందుకు ఉండకూడదు. పవిత్రత అనేది మానవహృదయాల్లో ఉండాలికాని—?''

''హృదయాన్ని పరీక్షించే యంత్రంకానీ, అలాటి శక్తి కానీ నాలోలేదు''

''అది నీఖర్మం! అలా చూడలేనివాళ్ళందరి దౌర్భాగ్యం! అన్నా చెల్లెలూ ఒకఇంట్లో ఎందుకు ఉండకూడదో, వాళ్ళ హృదయాల్ని ఏ యంత్రసహాయంతో లోకం చూసి అర్థం చేసుకోగలుగుతోందో—ఎట్లా చెప్తారు ?''

''—నీతిమీాది ఉపన్యాసం చాలాదూరం వెళ్ళింద... నాకు అవన్నీ అనవసరం.........వాణ్ని వెంటనే బైటికి పంపెయ్యాలి !''

నాకు ఎక్కడలేని కోపమూ వొచ్చింది. నా ఆగర్భ శత్రువునుంచికూడా ఇలాటి మాటల్ని వింటాననుకోలేదు. నాకు కుమారుడైనవాడు ఇలా అవమానిస్తాడనుకున్నానా ?

"ఏమన్నాన్! ఇది ఎవరిఇల్లో వారినే వెళ్ళిపొమ్మనేదా?"

"పోనీ—నువ్వే బైటికి వొచ్చెయ్...అంతకన్న గత్యంతరం లేదు !"

"ఎందుకులేదు ? వాళ్ళేవరో అన్నారన్నంత మాత్రాన భయపడటం దేనికీ ? లోకం వొకనాటికి నిజాన్ని గ్రహించ గలదేమో ? కాని ఆ నిజం తెలుసుకునేప్పటికి అంతామించి పోతోంది. ఆనాటి పశ్చాత్తాపాన్ని చూసేందుకు, మన ఆత్మలుకూడా తిరిగి వాళ్ళదగ్గరకు చేరవు"

"పోనీ నాకోసం వాణ్ని త్యాగం చెయ్యలేవా ?"

"త్యాగం అనేది బుద్ధిపూర్వకంగా ఎవరికివాళ్లు చెయ్యాల్సినపని. అంతేకాని అడిగి ప్రార్థించి త్యాగాన్ని చేయించుకోలేం; అది ధర్మంఅవుతుంది ! పోనీ నువ్వు యీలోకాన్ని నాకోసం ఎందుకు త్యాగం చెయ్యకూడదూ ?"

"లోకాన్నా ? నీకేమన్నా మతిపోతోందా ?"

"ఏమైనా వారిని యీపరిస్థితిలో నేను వొదలలేను. ఈప్రవాహానికి నేను బలయేందుకన్నా ఒప్పుకుంటానుకాని—నీతల్లి శీలవతి అనేమాటనుమాత్రం మరిచిపోవొద్దు. అంతకన్న ఆమెనుంచి నువ్వు కోరదగినదేమీ ఉండదేమో?"

"అతన్ని ఎందుకని అంతగాఢంగా ప్రేమించగలుగుతున్నావో తెలుసుకోలేనంత మూఢుణ్నీ అంధుణ్నీ మాత్రం కాదు...నీ కన్నకుమారుడికన్న అతనే నీకు ఎక్కువా?"

"కొడుకువనే ఇంతసేపూ భరించాను. వారిని అగౌరవంగా మాట్లాడే అధికారం కానీ, నన్ను శాసించగలిగిన తాహతు కానీ నీకు లేదు. ఐనా సహించాను. ఇక ఆయన ఎక్కువంటావా? అది నీభ్రమ! అంతకన్న ఇంకేమీ లేదు."

క్షణంలో వాడిముఖకళ మారిపోయింది. క్రూరత్వంతో వాడికళ్ళు మెరిసిపోతున్నయ్.

"ఇంకొక్క విషయం చెప్పు—వాడు నాకు తండ్రికాడు కదా?" అన్నాడు.

"ఆ అదృష్టం నీకులేదు......అలా జరిగినట్టయితే జీవితంలో సుఖపడిఉండేదాన్ని"

"ఐతే అతనిమీద నీకెందుకింత అభిమానం?"

"ఆకారణాలన్నీ నేను చెప్పగలిగినా నువ్వు అర్థంచేసుకోలేవు"

"ఇక నీనిర్ణయం మారదా?"

"గొంతులో ఊపిరి ఉండగా—"

మీరిలాగే సుఖపడండి......మీజీవితమధ్యంలో నేను యీలోకంలోకి వొచ్చాను. ఇది నీఇల్లు కనుక—నేనే బైటికి పోతాను,..ఏమంటావ్?"

"మోహాల్ని తృప్తిపరచటం కష్టమంటాను. నీకు 'మధు' అని పేరుపెట్టినప్పుడూ, నా స్తన్యం ఇచ్చి పెంచినప్పుడూ, ఇంత విషంతో నీశరీరం నిండిపోయిం దనుకోలేదు—"

"ఔను...ప్రియుడికోసం కొడుకును త్యాగంచేసేస్త్రీవి-"

"నీనాలుకకు హద్దులేదా? ఎలాంటి పరిస్థితిని కల్పించావో ఆలోచించలేవా?"

"నాఆలోచన అనవసరం—ఇప్పుడు నువ్వే ఇంకోసారి ఆలోచించుకో!"

"బెదిరిస్తున్నావా? ఇందులో ఆలోచించటాని కేమీ లేదు. ఎందుకంటే — ఆపరిస్థితిని చేసేందుకు — ఆలోచించినంతసేపుకూడా పట్టదు"

"ఐతే నేను వెల్తున్నాను...ఇక తిరిగిరాను—"

"తల్లిని కనుక నిన్ను ఆశీర్వదిస్తున్నాను—"

మాట పూర్తికాకముందే "అపవిత్రురాలి ఆశీర్వాదాలు నాకు అక్కర్లేదు—" అని వాడు చప్పున వెళ్ళిపోయ్యాడు.

కొద్దినిమిషాల్లోనే పరిస్థితి ఇంక ఘోరంగా తయారవు తుందని నేను అనుకోలేదు. హృదయమంతా క్షోభతో నిండిపోయింది. వాకిట్లోని ఆ కటికచీకటి ముద్దల్లోకిచూశాను —జీవితంలో ఇంతవైరాగ్యం న్లాకోసం వేచికూర్చుందా అనిపించింది...అలాగే నిలబడిపొయ్యాను—ఎంతోసేపు!

చలిగాలి ఘుమ్ముమనవీస్తోంది. ఏంజరిగిందో తెలియ నంతగా కొయ్యబారిపొయ్యానేమో ననిపించింది. ఇలాగే

ఉండిపోయినా బాగుండేది. క్రమంగా తలపులన్నీ తిరిగి వాటి స్వస్థానాలకు మళ్ళినయ్. జరిగిపోయిన సంగతులన్నీ, జరుగుతూన్న సంగతులరూపాన తిరిగి బాధించసాగినయ్... ఈ బాధలో నా అంతరాత్మ మహోత్తరశక్తి ఏదో 'నువ్వు విచారపడనక్కర్లేదు నీత్రోవ సర్వైందేనని నమ్ము' అని చెప్తోంది; అదొక్కటే నాకు ఊరడింపు.

గదిలోంచి దగ్గువినిపించాక కాని నాస్థితిని తెలుసుకోలేక పొయ్యాను. ఒక ఆత్మీయుడు నన్ను వీడినా, అంతకన్న విలువైనవ్యక్తి నాకు మిగిలివున్నారన్న ఆశ నాముందు చప్పున మెరిసింది. నా ముఖకళను అతను గుర్తిస్తాడేమో నని, కన్నీళ్ళూ, ముఖమూ తుడుచుకొని, తలుపుగడియవేసి. ఒణికే హృదయాన్ని చిక్కబట్టుకొంటూ మెల్లిగా చప్పుడు కాకుండా గదిలోకి వెళ్ళాను.

అతను మంచంలోనే కూర్చొనివున్నాడు. అరచేతుల్లో గడ్డాన్ని ఆనించి ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూన్నట్టుంది. నా పాదాల సవ్వడికి తలఎత్తిచూశాడు. అతని కళ్ళలోని ఆలోచనాభారమూ, వ్యథా నన్ను బాధించినయ్.

"ఇప్పుడే నిద్రలేచారా?" అన్నాను, బలవంతాన నవ్వుతూ.

"చాలాసేపయింది...కూర్చో!" అన్నాడు, తనప్రక్కనే స్థానాన్ని ఇస్తూ.

"రాణీ! యీరాత్రి చాలా పెద్దపొరపాటు చేశావ్! ఇలాంటి పరిస్థితీ, సంఘటనా ఏర్పడుతుందని నేను ఇదివరకే ఊహించాను. కాని నువ్వు—"

మాటమధ్యలోనే అందుకొని "ఐతే మీరు అంతా విన్నారా?" అన్నాను.

"విన్నాను—చెవిటివాణ్నయినా బాగుండి పొయ్యేదని పించింది"

"చివరకు నేను పొరపాటు చేశాననే నిర్ణయించారా?"

"నువ్వే ఆలోచించు: నిజానికి నేనెవర్ని? నీకన్న కొడుకును నాకోసం ఎందుకు వొదులుకున్నావ్? నాజీవితం ఇక కొద్దిరోజుల పరిమితిలోనే వుంది. నీ ముసలితనంలో నీకు ఆధారంగా ఉండేవాణ్ని, నీకష్టాల్లో సాయపడే వ్యక్తిని, నీ రక్తమాంసాల్ని పంచుకున్న ఆత్మ బంధువును...నా కోసం—"

"అదంతా మరిచిపొండి...వాడు ఎంత కఠినమైన మాటల్తో నన్ను బాధించాడో మీరు విన్నారు. తల్లిగా నేను వినవలసిన మాటలు అవ్వేనా? కృతజ్ఞతన్నా ఉండొద్దా?"

"ఝానురాణీ! దీనికంతకూ కారణం నేను! ఆమాటల్ని నువ్వు భరించాల్సి వొచ్చిందంటే—అది నాకోసంకదా!"

"తప్పంతా మీది అయినట్టు మాట్లాడుతారేం? ఇదసలు మన తప్పుకాదు...మీకు అన్నీ తెలుసుకదా!...పోనీండి—నేను అందుకేమీ విచారపడటంలేదు. వాడికళ్ళల్లోని క్రూరత్వానికి మాత్రం భయపడ్డాను. నేను వాడితల్లినే కాకపోయినట్టయితే, వాడు అడిగినమాటలకూ, మిమ్మ్మల్ని అగౌరవంగా మాట్లాడినదానికీ—వాడి ప్రాణాల్ని విలువగా తీసుకొని ఉండేదాన్ని— తెలిసిందా ?"

రోషమూ, అభిమానమూ, దుఃఖమూ నన్నిక మాట్లాడనివ్వలేదు. ఏడ్వసాగాను—సరైన గాలివాటుకోసం వేచి కూర్చున్న బరువైన నల్లని మేఘం—ఒక్కసారిగాఅకాత్తుగా వర్షించినట్టు—కన్నీరు ప్రవహించ సాగింది. ఇలా హృదయ మార ఏడ్చి ఎన్నాళ్ళయిందీ!

రవి మాట్లాడకుండా, సానుభూతిగా నాతలను నిమురసాగాడు. క్షణక్షణానికీ హృదయం తన భారాన్ని కన్నీటి ద్వారా తగ్గించుకుంటూ తేలికవసాగింది.

కొంతసేపయాక—"మీ ఆరోగ్యం బాగాలేదు... ఇక మీరు నిద్రపోండి" అన్నాను.

"మనిద్దరికీ హాయిగా నిద్రపొయ్యేరోజులు ఇక లేవు"

మిగిలిన రాత్రంతా ఇద్దరమూ మౌనంలోనే గడిపాం. మాట్లాడేందుకు ఇద్దరమూ పిరికిపడిపోయి వుంటాం...

## 9

"రోజులు క్రమంగా జరిగిపోతూనే ఉన్నయ్. రవి ఆరోగ్యంకూడా నానాటికీ దిగజార నారంభించింది. ఆ ముఖకళను చూస్తూంటే అతనిరోజులు నిండుతున్నయ్యనే మాటను ఎంత మూఢులైనా గ్రహించగలరు. మనిషి అంత సీరసించినా — ఆ కళ్ళల్లోని జ్ఞానకిరణాల వెలుగుమాత్రం తగ్గేదికాదు.

ఒకనాటికి అతనుయీలోకాన్ని విడిచిపెడతాడనీ, అతడు లేని యీలోకం నాకు నరకసమానమేననీ విచారించి ఎంతో బాధపడేదాన్ని. అతను అప్పుడు కాకుండా వున్నా — క్షణక్షణమూ యీలోకాన్నివీడే ఇతర జీవుల్లాగే ఉండిపొయ్యేవాడు. కాని హృదయాన్ని అర్పించాక, మళ్ళీ వెనక్కు లాక్కోవటమనేది మానవశక్తికి అతీతమైనపని !

ఈవిధంగా జీవితంలో గొప్ప భయమొకటి నన్ను ఘోరంగా వెన్నాడ సాగింది. మృత్యువంటేభయం ! బతకటం అంతకన్నా భయం ! ఇంకెలా ?

ఆ కాళరాత్రి రానేవొచ్చింది.

"మృత్యువు నాకింక ఎంతోదూరంలో లేదు రాణీ !" అన్నాడు రవి.

"అలా మాట్లాడకండి"

"మృత్యువును కనిపెట్టేందుకు మనం మొదటివాళ్ళం మాత్రం కాదు"

నేనేమీ మాట్లాడలేక పోయ్యాను.

"నువ్వేమీ విచారపడొద్దు. ధైర్యంగా ఉండేందుకు ప్రయత్నించు. నా మృతశయ్య దగ్గర నా ఆత్మబంధువు లందరూ నన్ను సాగనంపేందుకు సిద్ధంగా ఉన్నంత తృప్తి కలిగింది. అది నాకుచాలు: నువ్వింక యీ సంఘటనను ఎదు ర్కొనేందుకు సిద్ధంగా ఉండు—అంతే!"

మాట్లాడినప్పుడల్లా దగ్గూ, దానితోపాటు రక్తమూ వొస్తూనే వున్నయ్. నన్ను ఒకవింత అనుభవంలోకి ఎవరో బలవంతాన లాక్కుపోతూన్న ట్టనిపించింది. క్షణక్షణమూ నాకు మతిపోయేటంత భయం నన్ను బెదిరిస్తూనే వుంది.

"...రాణీ! మనం అతి పవిత్రంగా బతికామనేమాటను మరిచిపోవొద్దు ... నా పెట్టెలో వీలునామా అవీ ఉన్నయ్. అవన్నీ తరువాతచూడు...నాకు ఒక్కటే విచారం — నాకోసం నీ కొడుకును త్యాగంచేశావ్. ఆ విలువను నేను ఎన్నిజన్మాలకూ నీకు ఇవ్వలేను!"

వింటూనకూర్చోవటంకన్న ఇంకేమీ చేయలేకపొయ్యాను. పరిస్థితి తలుచుకున్నకొద్దీ కన్నీరు రానారంభించింది.

"రాణీ! ఏడవొద్దు...నా అంత్యక్షణాలు ప్రియురాలి నవ్వులమధ్య గడిచిపోవాలనేది నా తుదికోర్కె!"

ఆ కోర్కె తీరుద్దామని ఎంతో ప్రయత్నించాను. కాని నవ్వగలిగే క్షణాలు ఎంతోకాలంక్రితమే గడిచిపోయినట్టూ, అసలు నవ్వటమంటే యేమిటో మరిచిపోయినట్టూతోచింది. కనీసం నటకురాల్నయినా బాగుండిపొయ్యే దనిపించింది.

తెల్లవారుజామున మూడుగంటలకు అతని ఆత్మ యీ లోకాన్ని వీడింది. మొదట్లో ఒకశవం పక్కన ఒంటరిగా కూర్చున్నాననే భయం కలిగింది...కాని ఆలోచించాను: ఇంతకుముందుదాకా లేని భయం నాకు ఎందుకు కలగాలి? ఇతను నా ఆత్మీయుడు. జీవితాంతం వరకూ ప్రేమించి, ప్రేమించబడ్డ వ్యక్తి! అదేశరీరం—రక్త ప్రవాహమూ, ఆ ఉష్ణమూ మాత్రం లేవు. యీ శరీరం కదలదు; మెదలదు. ప్రాణంవున్న మనిషిని చూసి శవం భయపడటంలో అర్థంవుంది కాని— శవాన్ని చూచి ప్రాణంవున్న వ్యక్తి భయపడటంలో అర్థమే లేదేమో!

ఈనా ఆరాధ్యదైవం సూర్యోదయంతో భూమిపాలు! ......అప్పుడు యీ శీతల శరీరాన్నికూడా నేను చూడలేను. ఆ శవంమీదనే పడి నాలో నేను విచారించాను. ఒంటరి దాన్ని కావటంవల్ల ఆ దుఃఖ మంతా నేనొక్కతెనే అనుభవించాను; ఇరుగు పొరుగులకు గాఢనిద్రా సమయం కనుక, ఆ దుఃఖాన్ని బహిరంగంగా ప్రదర్శించాల్సిన అవసరం ఏర్పడ లేదు, అలా జరిగినట్టయితే— కొంత శక్తనా్న

వృథాగా ఖర్చయి-కొంత వరకూ తేలిగ్గా ఉండేదేమో?... ఉన్నట్టుండి ఏ ఒళ్లు తెలియని పారవశ్యంలోనో నన్నుకూడా మృత్యువు కౌగలించుకుంటే—ఎంత అదృష్టవంతురాల్ని!

# 10

"ఈ ఇంట్లో రవి తాలూకు మిగిలిన వస్తువులు—కొన్నాళ్ళ పాటు అతనిక్కడ నివసించాడనే మాటను మాటిమాటికీ జ్ఞాపకం చేస్తున్నయ్. వాటిని చూసినప్పుడల్లా సానుభూతి కన్నీరు రాక మానదు!

ఒకనాడు పెట్టె తెరిచాను. వీలునామా వుంది. అతనికి సంబంధించిన ప్రతి వస్తువా నాకు రాసివుంది. ఇదెక్కడి అభిమానం? నాకన్న చెప్పుకోదగ్గవాళ్ళు లేకపోవటంవల్ల ఇదంతా నాకే రాశాడా? ఇంత ఆస్తిని నేనొక్కతెనూ ఏం చేసుకునేదీ?

మధు ఉన్నట్టయితే బాగుండేదికదా అనే ఆలోచన కలిగింది. వాడు ఎక్కడికి వెళ్లాడో తెలియదు. వాణ్ని గూర్చి విచారించటానికి ఇదే మొదలు. వాడు కృతఘ్నుడై ప్రవర్తించినా—తల్లి స్థానాన నాకు ఎంతో బాధ్యతవుంది...కాని వాడి ఆశమాత్రం ఏవిధంగానూ కల్పించుకో లేకపోతున్నాను.

మృత్యువు ఒక్కటే నాసమస్య లన్నింటినీ తీర్చగలదనే నమ్మకం తప్ప నాకింకేమీ మిగలలేదు. కాని అదంటే ఎంతో భయం! చేతులారా ఆత్మహత్య చేసుకోవటం అసంభవం!

ఇక్కడి జీవితం నరక సమానంగావుంది. ఏదైనా దూర ప్రదేశానికి వెళ్ళి, శాంతియుతమైన వాతావరణంలో శేష జీవితాన్ని గడుపుదామనే నిశ్చయానికి వొచ్చాను.

ఈ రాత్రి నేను వెళ్ళిపోతున్నాను. నేను ఎక్కడికి వెళ్లేదీ, మళ్ళీ తిరిగి వొచ్చేదీ కానిదీ—తెలుసుకునేందుకు అర్హులైన వ్యక్తులు నాకెవరూ లేరు. అదీకాక—ముందు జరుగబొయ్యే సంఘటనలు చాలా అనుమానాస్పదమైనవి; కనుక నేనేమీ చెప్పలేను.

ధనం మీాద మోహం ఏనాడో పోయింది. జీవితంలోని అత్యవసరాలకు తప్ప—అది నన్ను ఇంకో విధంగా సంతోషపరచలేదు. అందుకని నేను బతకగలిగేందుకుసరిపడేధనాన్ని మాత్రమే స్వీకరిస్తున్నాను.

ఇదే కవరులో నా వీలునామాను కూడా పంపుతున్నాను. నా కుమారుడి ఫోటో వొకటి ఉంచాను. పదేళ్లలోగా వాడి ఆచోకీ దొరుకుతే—యీ ఆస్థంతా వాడిదే! వాడు దీన్ని

నిరాకరించినా, లేక అసలు దొరకకపోయినా—యీ ధనం దేశక్షేమకరములైన పనులకు మీరు వినియోగించవొచ్చు.

నా జీవితచరిత్ర లోకానికి అవసరమని నేను రాయటం లేదు. గొప్పవారి జీవితచరిత్రల్ని మాత్రమే చదివి ఆనందించగల లోకానికి, ఒక సామాన్యురాలి జీవితంలో విశేషమేమీ కనిపించకపోవచ్చు. నా ప్రవర్తనకు—నేను యీ సమాజంముందు తలవొంచి నిలబడి, ప్రార్థనా పూర్వకంగా క్షమనుకోరే బాధ్యత నాకు వుందని నమ్మలేను; ఎందుకంటే, చూచి గ్రహించలేని లోకం చెప్పుడుమాటల్ని కూడా నమ్మలేను. అది ఎంతగుడ్డిదో, అంత చెవిటిది కూడాను! అది నన్ను లెక్కచెయ్యలేదు కనుక, నేను దాన్ని లెక్కచెయ్యక్కర్లేదనుకుంటాను.

ఇక వొక్క వ్యక్తికోసం మాత్రమే దీన్ని రాస్తున్నాను. నా రక్తమాంసాల్ని పంచుకున్న ఆ కుమారుడు—ఏనాటికైనా దీన్ని చదవటం సంభవిస్తే—పశ్చాత్తాప పడతాడనీ తన తల్లి పవిత్రతను వాడు గ్రహించగలుగుతాడనీ నా నమ్మకం. ఏరాత్రి వాడునన్ను విడిచివెళ్లాడో, ఆనాడు వాడు యీకథను ఓర్పుతో వినేందుకు సిద్ధంగా లేడు. అందుకు తగిన అవకాశాన్నికూడా వాడు నాకు ఇవ్వలేదు. ద్వేష భావంతోనూ, ఉద్రేకంతోనూ, ఒక నిశ్చితాభిప్రాయం

తోనూ వాడానాడు తప్పుదారిన పడ్డాడు. రంగులద్దాల కళ్ల జోడు పెట్టుకున్నవాడి దృష్టితోమాత్రమే చూడగలడు; పైపెచ్చు అవి భూతద్దాలుకూడా అవటంవల్ల ఉన్నవిషయాల్ని ఉన్నట్టుగా చూసేశక్తిని కోల్పోయ్యాడు. ఆజోడు తీసేందుకు నిరాకరించినంత వరకూ, వాళ్ళదృష్టిలోని లోపం వారికే తెలియదు కూడాను!

కొంతకాలం గడిచిపోయింది కనుక, ఆ సంఘటనలోని భారమూ, ఉద్రేకమూ, ద్వేషమూ కొంతవరకూ తగ్గిఉండవొచ్చు. ఆ కళ్ళజోడుకూడా పాతపడి వుంటుంది. అందుకని నేను నమ్ముతాను—సత్యాన్ని సత్యంగానే చూసేందుకు ఇది సరైన సమయమని! ఇక్కడ సత్యదూరమైనవిషయాలు రాసే అవసరం నాకు లేదు. ఎందుకంటే—అబద్ధాలతో జీవితాన్ని గడపటం అతితేలిక: ఒక్క అబద్ధంతో ఆ రాత్రి నా కుమారుడు నాకు దూరమయ్యే పరిస్థితి రాకుండా చేసుకునే దాన్ని. కాని ఒక్కటే పట్టుదల—సత్యాన్ని సత్యంగా నేచూపి ఎందుకు తృప్తిపరచ లేనని. అది చాలాచుట్టుతోవఅయినా, శ్రమతోకూడిన పనయినా—సరైనమార్గం.

ఇది నాకుమారు డొక్కడూ గ్రహిస్తే చాలు. ఇక మిగతా ప్రపంచం సంగతి నాకు అనవసరం—మిగతా ప్రపంచానికి నాసంగతి అసలే పట్టలేదు కనుక!

జీవితంలో ఒకజ్ఞానిని పోగొట్టుకున్నాను. ఇక యీ అజ్ఞానాంధకారంలో, దారి తెలియని స్థితిలో బయలుదేరి పోతున్నాను—''

*   *   *   *

దాసు కథ పూర్తిచేశాడు. నేను అలాగే కుర్చీకి అంటుకు పొయ్యాను.

''భర్త పోయినప్పుడు.అప్పులవాళ్ల పాలైన ఆస్థివిషయంలో సలహాకోసం ఆమె నాదగ్గరకు వచ్చింది. ఆఒక్కసారే ఆమెను చూశాను. ఆదీనావస్థలో ఆమెకు సహాయపడే న్యాయ శాస్త్రం ఏదీ లేకపోయింది...అంతే! ఆతరువాత యీ కవరు నాదగ్గరికి వొచ్చినపుడుమాత్రం ఆవిషయం మళ్ళీనాకు జ్ఞాపకం వొచ్చింది. ఒక సామాన్యురాలి జీవితం కూడా నేర్చుకోదగ్గది చాల ఉన్నదనే విషయం అప్పుడే నేను గ్రహించగలిగాను—'' అని కాస్త ఆగి దాసు అన్నాడు: 'ఇప్పుడు మనం ప్రేమనుగూర్చి చర్చిద్దాం. నీ అభిప్రాయం ఏమిటీ?''

''శరీరమంతా పైత్యించి నట్టుంది. ఆలోచనలు ఏ ఒక్క దారిలోను నడవటంలేదు. మతే చెడిందనుకుంటాను'' అన్నాను.

"మొదట్లో నాకూ అలాగే అనిపించింది. ఒకరికి తెలియకుండా ఒకళ్ళు ఎంతో త్యాగం చేశారు. ప్రేమ ఎంత గుడ్డిదో మనం కొలవలేమోననికూడా అనిపిస్తుంది. ఒక జీవితానికి ముడిపడ్డ అనేక జీవితాలు ఒకటొకటిగా అత్యున్నతప్రదేశాన్నుంచి—పాతాళానికి జారిపడినయ్. చివరకు నేను అనుకుంటాను: అసలు ప్రేమనుగూర్చి చర్చించేఅధికారం మనకు లేదేమోనని—"

"ఇది నిజమే ననిపిస్తోంది"

"పదేళ్లూ దాటిపోయినయ్. వాడు ఇంతవరకూ దొరకలేదు. దొరుకుతాడనే నమ్మకంకూడా నాకు లేదు. ఆమె జీవితం సర్వనాశనం. ఇక ప్రేమించి సుఖపడేదేమన్నా వుందా అనిపిస్తోంది—

"ప్రేమను అంత ఉన్నతమైన స్థానానికి లాగటంవల్ల యీ ఇబ్బంది వొచ్చిందనుకుంటాను" అన్నాను.

"నేను అనేది అదికాదు: ప్రేమను వారు తుదివరకూ అనుభవించగలిగారు. వారి ఆదర్శం అత్యున్నత మైంది. కాని అది ప్రాక్టికల్ గా అనుభవించే అవకాశం ఎంతో కొద్ది మందికి దొరుకుతుంది. వారైనా ఇతర సుఖాలన్నింటినీ

త్యాగం చెయ్యాలి. ఇంతబలికోరే ప్రేమను గూర్చి తలుచుకునేందుకే భయమౌతుంది—''

''నిజంగానే నాకు భయంగావుంది ... మూడునెలలకైనా మామూలు మనిషి నౌతాననే నమ్మకం కలగటంలేదు''

ఆతరువాత ఇద్దరమూ మౌనంగా కూర్చొని పొయ్యాం. ఆరాత్రి ఆతలపుల మధ్య నిద్రాదేవికి మరి స్థానంలేక పోయింది.

డిసెంబర్ : 1946



